# త్యాగరాజయోగవైభవము

ఇది

తెలుఁగు ఇంగ్లీషు దీపిక, ఆయుర్భాగ్యవర్ధని, "శాంతం భూషణమ్"
గ్రంథకర్తయగు పిఠాపుర సంస్థాన పెన్షనర్
పెద్దాడ చిట్టిరామయ్యగారిచే
విరచితము.

లేఖకప్రమాద జనిత దోషములు లేకుండ
బ్రహ్మశ్రీ కాశీనాథుని వీరమల్లయ్య
గారిచే సంస్కరింపఁ బడి

ఏలూరు
మంజువాణీ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁ బడియెను.

**Laborare est orare "Work is Worship" (పనిపూజ)**
**Thomos Carlyle.**
"పూజాతేవిషయోపభోగరచనా" అప్పయ దీక్షితులవారు.

దీనివెల రు 0–3–0. (అణాలుమూడు)
**1912.**

# అభిప్రాయములు.

## బ్రహ్మశ్రీ. బుద్ధిరాజు కృష్ణబ్రహ్మము గారిట్లువ్రాసిరి.

"త్యాగరాజయోగ వైభవ" మను నీ నవీనగ్రంథము నామేనల్లుఁడు చి॥ పెద్దాడ చిట్టిరామయ్యచే రచింపఁబడినది. నేను బహుశ్రద్ధగా జదివితిని.

1 పదము, పదార్థము, పదార్థతత్త్వము నను త్రిభాగములుగ లక్ష్యలక్షణ సమన్వితముగ వివరింపఁ బడినది.

2 పూర్వభాగమున స్థూలత్యాగము వివిధకీర్తులుగ విశేషముగను పూర్ణముగను పండిత పామరాహ్లాదకరముగ నుండును.

3 కాని యుత్తరభాగమున వివరింపబడిన సూక్ష్మత్యాగరాజయోగ వైభవములితరజ్ఞానులకు నగోచరము. అతురతత్త్వజ్ఞానులకు మాత్రము పూర్ణానందకరము.

బుద్ధిరాజు కృష్ణబ్రహ్మము.



## బ్రహ్మశ్రీ. కాశినాధుని వీరమల్లయ్య కవిగారిట్లు ప్రకటించిరి.

అయ్యా!

తే. గీ. ప్రజల కుపయోగమగు త్యాగరాజవైభ
వంబు సాంగంబుగాఁ జూచి ప్రమదమొంది
నాఁడ సులభశైలిని వ్రాసినారుగాన
నఖిలజనపాఠకంబగు నవని సతము.

తే. గీ. త్యాగ మను మూఁడు వర్ణంబులందుఁ గలుగు
నట్టి భావ్యాంతరార్థంబు లరసి విపుల
ముగను వ్రాసితి రుపమేయములను గూర్చి
యశము గలుగుత మీకు చంద్రార్కముగను.

ఏలూరు,
9-12-12.

కే. వీరమల్లయ్య,
ప్రొప్రయిటర్, ఆంధ్రగ్రంథాలయము.

పైకమడిగినంత భగ్గున పడిచచ్చు
విశ్వదాభిరామ వినురవేమ. (వేమనశతకము)

దీనింబట్టి వదలలేనిగుణము లోభివానిగుణము లోభ్యము, నీచగుణమనియు, త్యజించుగుణము త్యాగమనునది దాతయొక్క గుణము ఉచ్చగుణమనియుఁ జెప్పవచ్చును. మనకు నన్ని పదార్థములనిచ్చు పశువులు, పాషాణములు, వృక్షములు, పూజనీయములగును. ఇందుకు లక్షణము. "శ్లో॥ త్యాగమేవ గుణశ్లాఘ్యః కిమన్యైర్గుణరాశిభిః త్యాగాజ్జగతి పూజ్యంతే। పశుపాషాణ పాదపాః" అర్థము. త్యాగము మెచ్చుకొనదగిన గుణము. అన్యగుణము లెన్నియైనను నవిలేక ప్రయోజనములుకావు. పశువులు, రాళ్ళు, చెట్లు, నెల్లకోరికల నీడేర్చును. కాబట్టి వానిని గౌరవింతుము.

త్యాగమునకు దాతృత్వము, త్యాగికి దాతయనునవి ప్రతి పదములు. కాబట్టి దాతృత్వమునకు లోభ్యము. దాతకు "లోభి" యనునవి వ్యతిరేక నామముల (Contraries) నంబడును. ఇందువలననే "దాతృత్వము" ను మహోన్నతగుణము పూర్వజన్మ పుణ్యావశమునకో లేక తల్లిదండ్రుల తపఃఫలమునకో, సహజముగ బుట్టవలసిన గుణమనియు, నేర్చుకొనునది కాదనియు మహాపురుష లక్షణమనియు, ప్రియవక్తృత్వము 'ధీరత్వము' ఉచితజ్ఞతయను గుణములుంగూడ సహజగుణములనియు నీతికోవిదులందురు. ఇదుకులక్షణము.—

శ్లో॥ దాతృత్వం, ప్రియవక్తృత్వం, ధీరత్వముచితజ్ఞతా।
అభ్యాసేననలభ్యంతి చత్వారస్సహజాగుణాః॥

ఈప్రకారదివర్ణనవలన నీత్యాగమను గుణముయొక్క మహిమాతిశయము ప్రకాశింపుచుండును. సుగుణమగు త్యాగముయొక్క ఉత్కృష్టత వర్ణించునప్పుడే దుర్గుణమగు లోభ్యముయొక్క నికృష్టతగూడ సూచింపబడుచునే యుండును.

## II త్యాగమురీతులు.

స్థూలత్యాగమని, సూక్ష్మత్యాగమని, త్యాగరీతులు రెండు అన్నోదకాదులనిచ్చుట తదర్థమై ధనము ధాన్యము తండులాదుల నిచ్చుట లోకోపకారార్థమై ధర్మకార్యముల నొనరించుట అర్థికోరినదానినిచ్చుట. స్థూలత్యాగమనబడును.

## స్థూలత్యాగము.

ఇది 1 అధమము, 2 మధ్యమము, 3 ఉత్తమమని ముత్తెరంగులు.

1 ఉది:—లోకులచేత మెప్పుఁగాంచుటకై పొరుగు వానివలె దానును కీర్తిపడ యుదునని చేయు త్యాగము అధమము. ఈత్యాగి

క. నిరుపేదల రక్షింపఁడు
సరసుఁడు సెర దాలిగాఁడు సంపన్నులదా
భరియించు వాఁడు దాఁగాఁడు
మెరమెచ్చుల దాత యుఁడుడు మేదిని వేమా.

అని చెప్పబడిన రీతిని 'మెరమెచ్చులదాత' అని వేమన చెప్పెను. ఇతఁడు తన స్వలాభమును కోరి యాకలిగొనిన గర్భ [illegible]లకు నన్నమిడుట నిరుపేదల రక్షించుట సంపన్నులను భరియింపకుండుట అన్నమునకై [illegible] కన్నఁబు పెట్టకుండుట యనగత్యముల ని గ్రహింప జాలఁడు. ఎప్పటియో యొక స్వప్రయోజన మపేక్షించిగాని, లోకవిఖ్యాతినొంద వలయుననిగాని, కొన్ని విషయములగు ధర్మకార్యములను జేయును పేరునకు ధర్మసత్రము, దేవళము. వనము, తటాకము, అని వానిని స్వలాభములకుం గూడ నుపయోగించును. ద్వీపాంతరవాసులగు నన్యదేశస్థులకై నూతులు, సత్రములు, మొదలగు పనుల నేర్పరచును.

2 స్వార్థ పరిత్యాగముతోను, స్వార్థపరత్వముతోను జేయు త్యాగము స్థూల త్యాగములో మధ్యరకము. ఈమధ్యరకత్యాగి ఉత్తమాధమములకు మధ్యగతిలోనుండు ను. గనుక మధ్యత్యాగి. మొదటి వానికంటె నధికుఁడు.

3 తన జీవయాత్రార్థమై వినియోగపడు కాలము గాక తదితర కాలమంతయుఁ; పరోపకారార్థమిదంశరీరం' 'పరోపకారాయ సతాం ప్రవృత్తిః.' అన్నట్లు లోకోపకా రార్థమై దనయావచ్ఛక్తియు నుపయోగించు [illegible]గము భగవదర్పితమని యను భవమువలననే గ్రహించుచుఁ దీక్షణమగు స్వార్థపరిత్యాగముతోనగ త్యాగఫలాపేక్షితుఁ డుగాక తనసర్వస్వమును, స్వకళత్రమును, స్వప్రాణమును, స్వశక్తులను, స్వజీవితకాల మునిచ్చివేయుట యుత్తమత్యాగము. ఇదియు సాత్త్వికత్యాగము. దృష్టాంతములు.

## మహోదారులగు నుత్తమత్యాగులకథలు.

I:—నేటికిరమారమి 400 సం॥ ల క్రిందట క్రీ॥శ॥ 1508 సం॥ న ఆనెగొంది యను హిందూసంస్థానమున శ్రీకృష్ణదేవరాయలను మహారాజు పాలింపుచుండెను. వినుకొండసంస్థానప్రభువుకోనబుద్ధారెడ్డియొద్ద మంత్రియగుకొగరు చీటి భాస్కరుని త్యాగకీర్తిని యార్వలేకయొక భట్టుకవినంపి యాతనిగి సేవనిసించుకొనిరమ్మనెను. ఆకవిపోయి యిమ్మనియడుగ నతడట్లు ప్రాణదానముంజేసెను. అప్పుడు గొప్పరెడ్ల సభామధ్యంబున గూర్చున్న యాభట్టు కవిభీకరాకారముగ కత్తితో పొడవనది కృత్రిమఖడ్గంబగుటచే ప్రాణము పోమి మిక్కిలి యాదాత విచారమునొంది మఱియొక సారి కత్తిబోనువుమన రెండవమారు బొడుచుటకు రాజునాజ్ఞ లేకుండుటచే బొడవనైనెను. ఇట్లు ప్రాణము తెగించి త్రికరణశుద్ధిగ దానమొసంగిన యాప్రాణదాతం జూచి యాభట్టుకవి రచించిన పద్యము.

సీ. ఫణిరాజు తన శిరోమణులర్థికిచ్చునో, యనివిష్ణుక్రిందట నణగియుండె
తనలోనిమణులనే తక్కినిచ్చునోయని, వనధిసంచలతనునొందుచుండె
సురధరాధరము నెవ్వరికిచ్చునోయని, తరణియగ్గిరిచుట్టు దిరుగుచుండె
కైలాసకుధర మేకవికిచ్చునోయని, యుగ్రుడక్కడకావలుండబూనె

గీ. నారసీదాన విఖ్యాతి యఖిల దిశల
మించివిలసిల్లె నీకీర్తి యెంచ దరమె
తల్లి యేవేళ గనియెనో తండ్రినిన్ను
ప్రణుతసగధైర్య రాయని భాస్కరార్య.

II ఇంతటితో నామంత్రి యౌదార్యమునకు నోర్వంజాలక రాజు భాస్కరమంత్రియొక్క భార్యనొసగుడని యిద్దరు బ్రాహ్మణులనంపెను. ఆప్రకారముగ వారు వినుకొండకుంబోయి లేదనకిచ్చుదాత వనెడు ఖ్యాతిగాంచితివిగాననీ రెండవభార్యను నేను వివేకంబుగాన నాయుశ్వలాభంబుతో యామెనిమ్మని వారిలో బ్రహ్మచారి యడిగెను. అటులా మంత్రియొసంగి యారేయి కేళికాగృహంబున వారలనుంచ నెంచి పతివ్రతాశిరోమణియగు నామెమనస్సు దిట్టపరచి విప్రుండు మందిరములోనికి నాసతీమణింబంప బ్రాహ్మణుండామెను నెదురేగి తల్లీ నీవు జగదేక పతివ్రతవు నేనునీపుత్రుండనని పొగడుచుండెనవ్వల్లోకము

నీదెసు కృష్ణకవ్వ పరమేశ్వరుకంతము గప్పుకప్పి మా
పేదమయాచకీర్తి విలసిల్లెనుదిక్కులు పిక్కటిల్లుచున్."

(ముప్పదియిద్దరు మంత్రులచరిత్రము.)

IV పరశుకావతారమని చెప్పఁబడుభక్తుడు కబీరదాసు తన న్యాయార్జితవిత్తముతోఁ దనకుఁగల కొలఁదినతిథి యభ్యాగతులకు నన్నదానము చేయుచుండెను. ఇట్లుండ నొకనాఁడు కాశీయాత్రార్థులగు ననేకసాధువులు మార్గాయాసమున నతనియింటికి నన్నాతురులై రాఁగా తగుసామగ్రి సంపాదనకై మూల్యములేకుండుటచే భార్యయగుసుందరాదేవిని దాకట్టపెట్టి యాయతిథులం బరితృప్తులంజేసెను. (భక్తవిజయము.)

V పూర్వము కాశీపట్టణమున శ్రీమంతుఁడను మహారాష్ట్రప్రభువు నివసించెను. కృష్ణాజిల్లా యమరావతి ప్రభుండగు వాసిరెడ్డి వెంకటాద్రి నాయుండను సామంతరాజు గంగాస్నానమునకయి కాశికింబోయి యొకానొకదినమందుఁ గారణాంతరమున నీనాయుఁడు శ్రీమంతునియాజ్ఞచేతఁ గారాగృహనివాసముగాంచెను. ఎట్టకేలకువిమోచితుఁడై యా శ్రీమంతుదర్శనము జేసినపుడు "అన్నదాతయగు బందాపరదేశరాజు మంత్రి నివసించుగ్రామ సమీపమునుండు పల్లెలనేలుకొను పాళెగాఁడవా ? యని యడుగఁ బడెను. అందుపయి నాపరదేశియం దనూయత గలవాఁడై యిల్లునేకి యాతని కఠినశిక్షనుండి తప్పించెను.

తనకు నప్పటికి గలిగినంతలో నన్నదానముఅప్పరదేశి మానక చేయుచునే యుండెను. కొంతకాలమునకు దారిద్ర్యము హెచ్చువెచ్చిల్లుటచేఁ గాశీయాత్రార్థమై యాదంపతులిల్లువడలిరి. కొంతదూరముఁబోవఁగ బాటసారులు కొందరు మూఁడుదినంబులనుండి నిరాహారులయి యన్నాతురులయి బందాపరదేశిగారున్న గ్రామం బెంతదూరమున్నది? యాదాతయిడు నన్నముతోఁ దృప్తులమగుదుమని యనుకొనుచుండఁగాఁ సిగ్గుఁజెంది యిట్టియన్నాతురులకు నాకలిఁదీర్పని బ్రతుకేల? ఇంట మిగిలియున్న రుప్పరోలు విక్రయించిరైన వీరందరిని దనిపి మరిపోదమని యాదంపతులు నిశ్చయించుకొని యాబాటసారులకంటెముందుగ బోయిలుసేరి రుబ్బురోలు దొర్లింపఁగా దానిక్రిందనసంఖ్యాకమగు సువ

ణ్ణంబులు దొరికెను. ఇట్లు దారిద్ర్యంబు విడిచి పోవనెప్పటి యట్లన్నదానము జయపద్మ: ర్మమే జయమని చెప్పినతని దేవుఁడువారికి పునరుద్ధారణ శక్తిం గలుగజేసెను.

(ముప్పదియిద్దరు మంత్రులచరిత్రము)

పెట్టిపుట్టనివానికి కలుగదని లోకోక్తి కలదు. అనగాఁ బూర్వజన్మమందు దీయనివానికి నీజన్మయందుం దొరకదను నమ్మకముగలదు. వనవాసము చేయునపుడొకదినమందు శ్రీరామమూర్తికిని సీతాలక్ష్మణులకును నన్నము లభింపకపోవఁగా రాముఁడు లక్ష్మణునితో,-

శ్లో॥ ఉత్పతన్నపి చాకాశం విశన్నపి రసాతలం।
చరన్నపి మహీంకృత్స్నాం నాదత్తముపతిష్ఠతి॥

అను శ్లోకప్రకార మూర్ధ్వలోకమున కెగసినను నధోలోకమునకు దిగి పాకులాడినను భూలోకమున వెతుకులాడినను, పూర్వజన్మమందుఁ బెట్టియుండనివానికి నీ జన్మయందు దొరకదని వక్కాణించెను.

మనము చేయు నన్నదానము మిక్కిలి యాకలిగొనినవారి కుక్షిలోఁబడినపుడును, మహానుభావులగు కారణజన్ములకుక్షిలోఁ బడినపుడును, దాతయొక్క సద్భావముతోఁ జేయబడినపుడును నుత్తరక్షణమందె దానఫలము కోటిగుణితమగును. ఇందుకు నిదర్శనములు

(1) కుచేలుఁడను బ్రాహ్మణుఁడు ద్వాపరయుగమందుండెను. పేరునకే కుచేలుఁడుగాక జీర్ణచేలములన చిరికెలగుడ్డలు ధరించుటచేత నట్టి సార్థకనాముఁడాయెను. ఇతఁడు స్వచ్ఛమయిన శ్రోత్రియుఁడై యుంఛవృత్తిచేత బహుకష్టముతో కుటుంబ పోషణ చేసికొనుచుండెను. బాల్యావస్థయందు సాందీపుఁడను బ్రాహ్మణోత్తమునియొద్ద శ్రీకృష్ణుని సహాధ్యాయుఁడై అధ్యయనాదివిద్య లభ్యసించెను. చదువుసాములు విడిచి గృహస్థాశ్రమములో నున్నప్పుడు దరిద్రదేవత విడవనందున నుదరపోషణార్థము శ్రీకృష్ణ భగవానుల నాశ్రయించబోయెను. ఆబ్రాహ్మణుఁడు తొలిపుట్టువున పెట్టినవాఁడు కానందున తననుఁ గొల్వవచ్చిన కుచేలుని నెయ్యుతో మాటాడుసందర్భమున నతని జీర్ణవస్త్రమునఁ గట్టిన యటుకుల నడిగి భుజించెను. ఇట్లు పెట్టినవానికే పుట్టునను లోకోక్తి సార్థకపరచి యా యటుకులకుఁ బ్రతిఫలముగ నావెంటనే సకలసంపదలు కుచేలుఁడందెను.

(2) విశాఖపట్నం జిల్లాయందు అజ్జాడయను గ్రామముగలదు. అందు నేటికి చాలాకాలము క్రిందట నిరతాన్నప్రదాత అజ్జాడ చయనులను శ్రోత్రియ బ్రాహ్మణుఁడు ఒకనాటి నడిరేయి పంచముండొకఁడు క్షుత్పిపాస పీడితుండై యేటావలనుండి అన్నమన్నమని గావుకేకలిడుట విని మిక్కిలి ప్రత్యాసక్తితో వానికిఁ గావలయు నన్నోదకములను పదిలముగ దా స్వయముగ మోసికొనిపోయి యేరుదాటి సాదరముగ నామాలవానికి నన్నోదకములనిచ్చి దృప్తుంజేసెను. చదువరులారా! యీయన్నదాన ఫల మెంతో వినుడు:—కొంతకాలమునకు తర్వాత పాఱుగున నుండు యవ్వన బ్రాహ్మణ విద్వాంసుడు నడిగాలమందు మరణమంది ఆశాపాశతుఁడై బ్రహ్మరక్షస్సను పిశాచజన్మ నొంది యొక స్త్రీనింబట్టి బాధింపుచుండెను. బహుదినములనేక వైద్యు లనేకవిధ చికిత్సలుచేయగ రోగియును, వైద్యులును, విసికి వేసరి కర్తవ్యాంశము దెలియకుండిరి. "ఉదకాద్బ్రహ్మరాక్షస్సే" అజ్జాడ చయనులుగారు నాటిరాత్రి పంచమునకు పెట్టిన యన్నదానఫలము తనకు ధారాదత్తముచేసిన రోగి సుఖియగుటయేగాక తనకుం బిశాచజన్మము వదలునని చెప్పెను. సజ్జనుడగుటంజేసి చయనులుగారట్టి సంకల్పముతో ధారవిడుచుటచేత వారందరు తరించిరి నాటినుండియు దెయిలా గ్రహబాధ తిరిగి యెన్నడును గనపడలేదు. ఈవైతీయము గోదావరి విశాఖపట్టణ మండలములలోఁ బ్రసిద్ధము.

బీదలలోగాని, సాదలలోగాని యన్నదానిని లేదనకిచ్చు మహోగ్రవ్రతము నవలంబించువారికిని సర్వస్వము, స్వభార్యయొక్క సువర్ణ మంగళసూత్రము (పుస్తె) నుంగూడ లేదన కిచ్చువారికి భక్తవత్సలుఁడును లోకపితయునగు నీశ్వరుండు రక్షకుఁడై సద్యఃకాలమందె (తత్క్షణమే) అక్షయసంపదలిచ్చును. ఇందుకు దృష్టాంతములు:—

(1) వితరణసాహసాది సద్గుణములయొక్క యవ్యాజకీర్తిచే నోర్వఁజాలక తొంగ రుచీటి భాస్కరుఁడను నియోగిబ్రాహ్మణుని యస్ఖలిత దానవ్రతభంగము చేయవలయునని కృష్ణదేవరాయలు నేటికి రమారమి 400 సంవత్సరములక్రిందట నొకనాటి సూర్యగ్రహణకాలమందు భాస్కరమంత్రిం బిలిచి తనతోఁగూడ నదికి స్నానార్థ మాతని రప్పించి యుభయులును సుస్నాతులై సువర్ణదానం బెడతెగక పోటీతో జేయుచెడ తన ధనంబు పరిమితమగుటంగాంచి భాస్కరుండు:—

శ్లో॥ ద్రవిణం పరిమిత మమితవ్యయనం జనమాతులీయపతే।
హేమాంశుకమివ పీన స్తనజఘనాయాః కులీనాయాః॥

పీనస్తనజఘనములుగల కులకాంత హీనవస్త్రురాలై సంకుచితురాలై యుండు రీతిని మితముగల తన యాదాయమునకు నమిత వ్యయము లటస్థించి యిక దానముచేయలేనని ప్రజాపాలను ఆకులమందుచున్నారు.

'శ్లో॥ పయిశ్లోకమును స్మరించుకొనుచు నిక లేదనుటకంటె ప్రాణంబులువిడుచుట మేలని తనయిష్టదైవంబగు శ్రీరామమూర్తిని ధ్యానించుచు తానదివరకు దెచ్చి యుంచుకొనిన విషపాత్రంబందుకొని త్రాగ బ్రయత్నించంగ భక్తవత్సలుండును, దుష్టశిక్షకుండును, శిష్టరక్షకుండును, దాతలకుం దాతయునగు శ్రీరామచంద్రుండా భాస్కరుని విషపాత్రంబున స్వకీయ ముద్రాంకితంబులగు శ్రీరామమాడ లక్షయంబుగజేసెను. "దైవేబలేదుర్బలే" (అనగ దైవబలముతో సాటి బలములేదు.) అన్నట్లు సర్వశక్తుడగు దేవునియనుగ్రహముగల భాస్కరునియెదుట పౌరుషమాత్రబలముగల యారాయలవారు ప్రయాసతో నలసియు, లేమిచేసొలసియు విముఖుండై నిజనగరునకుం జనిరి; (ఇకధ ముప్పది ఇద్దరు మంత్రుల చరిత్రమునుండి గ్రహింపబడినది.)

(2) నిట్టల హరియమంత్రి చరితము. ఇదియును 32 మంత్రుల చరిత్రమునుండి గ్రహించబడినది- ఈయన శ్రోత్రియుండు. అనంగా నిప్పటివైదిక నియోగి తెగలలో వైదికి వితరణ సాహసాది గుణములు గలిగియు విశేషధనవంతుడగుటచేత భాస్కరాదులకంటె మించినదాతయను కీర్తి వడయుచునుండంగ నితరులగు సచివోత్తములనగ నియోగిబ్రాహ్మణు లాదాతను వంచింపందలంచి తమతమకడనున్న భట్టుకవులంబిలిచి యడిగి లేదనిపించుకొనిరండనగ నందొకభట్టుకవి యాదాతను దర్శించి, ధనవంతుండయినను నతండు లోభియను ననుమానముతో,

క॥ నిజమా రాజ్యసుఖంబులు। నిజమా తరుణీవిలాస నిరుపమలీలల్।
నిజమా సంపచ్ఛ్రయములు। నిజమా యీజీవనంబు నిట్టల హరియా॥

అను పద్యంబువిని యుదారుండుగాన, నాతను నిట్లే తోంచెదు నని సంతసించి మోయంగల సువర్ణంబా యర్థికి నీయంబోవ నేనడిగినప్పు డిండని కవి తెలిపి పోయెను. వెంటనే మతియొకభట్టు దర్శించి యాదాతంగూర్చి చెప్పినపద్యము.

క. ధీరోదార గుణంబులు గారణజన్ముకు వేరె గరపగవలెనా
ధారుణిలో టెంకాయకు నీరెవ్వరు పోసిరయ్య నిట్టలహరియా.

అనిచెప్పిన తన యభినివేశంబు దెల్పినందుకు మెచ్చి యతడు తూగునంత బంగార ము బహుమాన మిచ్చెద గొనుమనెను. యాభట్టుకవియు మునుపటి కవివలె తానుగోరిన ప్పుడీయవలయునని బలికి నిజేచ్ఛం జనియె.

పిమ్మట మిగిలిన భట్టుకవులందరు బహుమతు లందగోరి యేకముఖంబుగా స్తుతి యించినపద్యము.

క. నిట్టలహరియుండైయిల బుట్టెను సురధేనుకల్ప భూరుహములదా
మట్టులగాకుండిన చో నెట్టులనిచునర్థికోటి కీప్సితఫలముల్.

ఈపద్యంబునకు మిగుల నానంద భరితుండై మీరు కోరినదిచ్చెదనన మాకందఱు మీయిల్లుచూర విడువవలయునని కోరిన సరేయని యొకజాము చూరవిడచెను. వారందరు ను గొన్నిజాముల వరకు దేవిడి యొద్దనె దాతను కుటుంబముతో నిల్పి మోయగలిగినంత ధనముగొనిరి. ఇకనేమైన మూల్యముండు నాయని యానెుదటి కృత్రిమ యాత్రి తమకు వాగ్దానముచేయబడ్డ ధనముల నిమ్మనిరి. అంతనా నెఱదాత తన కుటుంబముపైన యొడలి నగలన్నియు నొలిచి తూచియిచ్చెను. అవి సరిపడనందున తుదకాదాతయొక్క ధర్మపత్ని పతియభిప్రాయంబెరింగి యొకపసుపుకొమ్ము నాత్రమ్మున ధరించి గతమానంబుఁ దులనిడుటయు వారలాసాహసంబునకు సంతసిల్లి చెప్పినపద్యము.

“క. దాతలదాతవుగదరా భూతలమున నెట్టిసుకృతముం జేసిరొకో
ఖ్యాతిగలనిన్ను గనుటకు నీతలిదండ్రులు గడంగి నిట్టలహరియా.

అని తమవచ్చినవృత్తాంతంబు చెప్పుటయు అంతనాపండితాఖండలుని భాండాగా రంబు లెప్పటివలె నిండియుండెనట.” (మంత్రుల చరితము.)

ధర్మగుణము, భూతదయ మొదలగు సుగుణములు క్రీస్తుప్రులందేగాని హిందూ మ తాదులందు లేవని కొందఱు క్రైస్తవుల యభిప్రాయమని యెఱింగి “ప్రాచీన హిందూ

దేశము" అను శీర్షిక క్రింద శ్రీరవీంద్రనారాయణఘోస్ ఎమ్. ఏ. ఆంధ్రభారతియను మచిలీపట్టణపు 1912 సం॥ జనేవరి నెలపత్రికకు వ్రాసిపంపిన యంశములు ప్రస్తుత త్యాగవిషయము (దానధర్మముల) తో సంబంధించినవిగాన వాని సారాంశములిందు గ్రహింపఁబడుచున్నవి.

(1) సూరతు పట్టణమందనేకాలయములుండెను. అందు "వణిగ్వరవైద్యాలయము" మిక్కిలి ప్రసిద్ధము. క్రీ. శ. 1780 సం॥నకుఁ బూర్వము మంచి స్థితిలో నుండెను. రోగగ్రస్థజంతువులు, ముసలివారు, వికలాంగకములగు మృగములచట సంరక్షణము నొందెను. క్రీ. శ. 1772 సం॥ గుఱ్ఱములు, గొఱ్ఱెలు, గాడిదెలు, కోతులు, కోళ్ళు, పావురములు మొదలగు జంతువులు సత్కారములనొందెను. క్షుద్రజంతువులగు నెలుకలు, చిట్టెలుకలు, నల్లులకుఁగూడ నెలవొసంగఁబడెను ఒకతాబేలచట సురక్షితముగ 75సం॥ జీవించెను.

(2) నీపొరుగువానిని నీవలెనె యిచ్ఛయింపుము, అను నీతి ప్రతిజాతియందును వ్యాపించుచున్నది. ఈవిషయములో ననేకజాతులవారు తమతోడిమానవులనే ప్రేమింపుడని గలరు. అయితే భరతఖండవాసులు తమతోడి మానవులయందే కాక తక్కిన యశేష చేతనములందునుఁగూడ దయగలిగి యుందురు. "ఏకంతు పండితో జ్ఞాత్వా సర్వభూతమయం హరిమ్" అను విధినిబట్టి ఈశ్వరుడు సర్వచేతనములందు గలడని చదువరులు గ్రహించి ప్రతిప్రాణిని గౌరవించుచున్నారు. హిందువులు పిపీలికాది బ్రహ్మపర్యంతము గల ప్రాణికోటిని ప్రేమతో జూచుచుండగ నితరులు మనుష్యులనుమాత్రము ప్రియముతో జూతురు. అనుసంగతి "కొలంబోనుంచి ఆల్మోరావఱకు" అను గ్రంధముయొక్క 35, 39, పుటలందు లిఖించబడియున్నదని సదరు ఘోసుగారు తెలిపిరి.

(3) హిందువుల ధర్మమునకు హద్దుపద్దులేదు. వీరిధర్మవైశాల్యము క్రైస్తవులెఱుగరు. ఎఱుఁగఁజాలరు. పూర్వకాలమున సుస్థిరహిందూస్థానమును పాలించిన శ్రీహర్షవర్ధనుఁడను రాజు క్రీ. శ. యేడవ శతాబ్దమున (నేటికి 13 వందల సం॥ల క్రిందట ప్రయాగ పట్టణమందు పాంచవార్షిక మహాసభఁగావించెను. ఆసభకు సామంతరాజులందఱు విచ్చేసిరి. అతిధులు, అభ్యాగతులు 5 లక్షలువచ్చిరి. దానధర్మములు 75 దినము

లు జరిగెను. ఈతరుణములో జరిగిన చర్య మిక్కిలి విచిత్రగనుండెను. నాలుగవ నాడు పదివేల బౌద్ధశ్రమణులకు విందుపెట్టెను. ఒక్కొకనికి నూరుచొప్పున బంగరుకాసులను, నొక్కొకమంచి ముత్యమును, క్రొత్తబట్టలును, పుష్పసుగంధములను సమర్పించిరి. చిత్రవిచిత్రముగ తక్కిన 71 దినములు దానధర్మములు జరిగెను. ఇట్లు రాజు తనవిత్తమంతయు ధర్మముచేసి తదనంతరము తనయావత్తు జవాహిరి తుదకు కట్టుబట్టల స్వస్థ మానసములో త్యాగముచేసి సర్వత్యాగియై, సన్న్యాసియై, యొకశాటిముక్కని తనయక్కగారిని యాచించెను.

(4) హిందువులలో సదావ్రతమను నొక సమాజముగలదు. నిశ్చలమగు దైవభక్తియు నతిథియభ్యాగతుల సత్కారమును దీనికి ముఖ్యోద్దేశ్యములు. ఈ సదావ్రతమును గూర్చి "పూర్వ హిందూదేశ చరిత్రము" నందు భోజపురరాజు, వార్ధారసింగను కాయస్థుడు, అబ్దుల్ నాసురను మహమ్మదీయుడు, శ్రీ [illegible] దియ నారీరత్నమును, లాలా రాజారిపు, లాలాకానంగ, యనునిర్దిష్ట [illegible] అతిథి, యభ్యాగతులకెల్లరకు సంతర్పణముచేయువారిలో ముఖ్యులని మంట్గోమరి మార్టిన్‌గారు వ్రాయుచున్నారు. పూర్వాచారమను "సదావ్రతము అఖండదైవభక్తి" యనిచెప్పుదురు. దీనింబట్టి నిజమైన హిందువులు నిత్యము శక్తికొలది దానము చేయవలయునను విధిగలదు.

దానధర్మము, భూతదయవిషయములలో నేటికి 13 వందల సం॥ లక్రిందట నుత్తరహిందూస్థానము నేలిన శ్రీహర్షవర్ధనుని కాలమందును నేటికి నాలుగువందల సం॥ల క్రిందట నాంధ్రమును పాలించిన కృష్ణదేవరాయలవారి కాలమందును నడచిన వ్యవహార మార్గములు వేర్వేరుగనున్నవి.

శ్లో॥ ఔదార్యస్య తృణంవిత్తం శూరస్యమరణంతృణం।
నిష్కామస్యతృణంనారీ నిస్పృహస్యతృణంజగత్ ॥

అను శ్లోకప్రకారము శూరుడు మరణమును, నిష్కాముడు కాంతను, నిస్పృహుడు జగత్తును గడ్డిపోచగ జూచినట్లు ఉదారుడు ధనమును గడ్డిపరకగా నెంచి దానధర్మములను భూతదయయును బ్రకటించును.

బ్రిటానియా వారు మనదేశమును పాలించు నిన్నూటయేబది సంవత్సరములలో కడపటి యర్ధశతమానములో దటస్థించిన దేశీయ విచారింతము:—పందొమ్మిదవ శతాబ్దమధ్యమున నిండ్యా తెలుగు సంగ్రహ భూగోళముంబట్టి భరతఖండ జనాభా పదునాల్గు కోట్లుగనుండెను. అయితే 1911 సం॥ మార్చి జనాభా గణితీ ప్రకారం 31½ కోట్లుగ నుండెను. దీనింబట్టి కడచిన అరవై సం॥ల క్రిందట నూరుమంది జనాభాగల పల్లెలో నేడు 225గురు జీవులుందురు. తదనుకూలముగ పశుపాషాణ పాదపములును, ఖనిజ, వృక్ష, జంతుకోట్లు, దేశపాలకుల పౌరుషశక్తివలన గలుగు, కృషి, వాణిజ్య, గోరక్షణ, మశీదములును, శిల్పములును, చదువులు, సాములు, గరడీలు, మార్గములు, ధూమశకట మార్గములు, తంతిటపాలు, యంత్రములు, జలాధారములు, మొదలగు దేశాభివృద్ధి సాధనములు హెచ్చుగ పెచ్చు పెరుగుటచేత దేశసంపదయును ఇబ్బడి ముబ్బడిగ హెచ్చెను. బ్రిటానియావారిరాజ్యము రాజ్యాంగములు కాలానుసరణముగ వర్ధిల్లి దేశముయొక్క కలిమి, తెలివితేటలు, సెమ్మది, సుఖము, హెచ్చి గతికాలపు దారిద్ర్యము, లేమి, అందోళనము, అణగంటేనవి. అందుతో త్యాగరీతులును మారినవి. గతకాలములలో మార్గాయాసపడి 2, 3 దినములన్నము దొరకక తిరుగు యాచకావళియును భట్రాజులు, కవులు రూపుమాసిరి. బహుళముగ వారిప్పుడు స్వతంత్రవృత్తులగు కృషివాణిజ్యాదులచేత జీవించుచున్నారు. ప్రాచీనకాలములో జమిందారులు, సామంతరాజులు, జాగీరుదారులు, భూఖామందులు మాత్రమె ధనవంతులైయుండిరి. ప్రస్తుత మన్ననో బ్రిటానియా రాజ్యాధికారముక్రింద వ్యవహరించు జమీందారులు, సామంతులు, భూఖామందులు, రయితులు, నాటువర్తకులు, కోస్తావర్తకులు, వకీళ్ళు, వైద్యులు, శిల్పులు, ఉద్యోగస్థులు, కంట్రాక్టర్లు, బోధకులు మొదలగు బహుజనులు ధనవంతులై యున్నారు. వారిలో సౌదార్యముగలవారు పెచ్చుపెరిగియున్న జనాభాలో తటస్థించిన పేదమూకలలోనుండు బీదలకు, రోగులకు, వికలాంగులకు, వృద్ధులకు, బాలవితంతువులకు, దిక్కుమాలిన విద్యలకు, దిక్కుమాలిన పిన్నలుమొదలగు దీనులకు సన్నవస్త్రములు, ఔషధములు, సత్రములు, శరణాలయములు, పాఠశాలలు నొసంగుచున్నారు. వారల దాన ధర్మముల కీర్తిప్రతాపములు, వారిభూతదయయు పూర్వకాలపు భట్రాజులయొక్క కృతుల పూర్వకముగ వెలువడుచున్నను, వార్తాపత్రికలమూలముగ పత్రికావిలేఖకులు బహుముఖములుగ శ్లాఘించుచున్నారు.

ఆ 1911 సం॥ 12 డిశంబరు తేదీని ఢిల్లి పట్టాభిషేక మహోత్సవ కాలమందు మహోన్నతులైన పంచమజార్జి రాజ చక్రవర్తిగారు నిండు సభయందు సింహాసనాసీనులయి భరతఖండ బీదపిల్లల ప్రథమ విద్యా భోధనమునకు (Eelementary Education of the poor young Hindus.) వార్షికముగా అర్ధకోటి రూపాయలు విరాళమొసంగిరి. మఱియును హిందూ మహమ్మదీయ సంతతులలో మహామహోపాధ్యాయులకును షెమ్సుల్ఉల్మాలకును వార్షిక విశ్రాంతి వేతనముల నొసంగెను.

## స్వదత్తాద్వి గుణంపుణ్యం పరదత్తానుపాలనం.

అను మహావచన సరణిని నాటి తరుణమున పైన వివరించిన దానధర్మములను భూతదయంజూపెడు సదాచారులగు జమిందార్లు, సామంతులు, భూఖామందులు, రయితులు, వర్తకులు, వకీళ్లు, వైద్యులు, శిల్పులు, ఉద్యోగస్థులు, కంట్రాక్టరులు, బోధకులు, మొదలగు వారికి నుత్సాహము పురికొల్పుటకై రాజచక్రవర్తిగారును వారితరపున వారి ప్రతినిధులగు గవర్నర్ జనరల్ అను వైసురాయిగారు నొసఁగిన యోగ్యతాపత్రికల సంఖ్య వలన ప్రస్తుతమున నయ్యుదయాస్తాచలసేతు సీతనగ మధ్యాధారులలోను ధార్మికులలోను రాజమాన్యులు, రాజపూజితులైన వారందరిని స్పష్టముగ నందరికిని తెలియుచున్నది.

వీరిలో సదాచారగుణము, వ్యవహారజ్ఞానము, దేశభక్తి, రాజవిశ్వాసము మొదలగు సుగుణరాశి యనఁదగు వెనుకఁ జేర్కొనఁబడిన పురుషరత్నముల చరిత్రము విస్పష్టముగ వర్తమానపత్రికల మూలముగఁ బ్రకటితమై యుండినను ఈ గ్రంధమును జదువువారికి హృదయరంజకముగ నిట విశదపరచబడుచున్నది.

### ఆనరేబిల్. వి. కృష్ణసామయ్యరు, సి. ఎస్. ఐ. గారు.

ఈమంత్రీంద్రుఁడు ద్రావిడబ్రాహ్మణకులోత్తముండు. చెన్నరాజధాని దొరతనమువారి కార్యస్థానములలో నియోజితుఁడై క్రమముగ నున్నతన్యాయసభాధిపతియై

తునకు గౌర్నరువారి శాసననిర్మాణ సభాసభ్యత్వం డాయెను. ఈయనగారి జీవితకాలము యొక్క కడపటి సంవత్సరమున గవర్నరుగారి కార్య నిర్వాహక సభకుం గూడ అధ్యక్షుండా (Executive Council member) యెను. మద్రాసు రాజధానిలో నీ యున్నతపదవిం జేకొనిన ప్రథమగృహస్థుఁ డీ మంత్రిశేఖరుండె. ఈ యయ్యరుగారికి వృద్ధాప్యము రాకమునుపె ఆ 1912 సం॥ జనేవరునెలలో నకాలమరణము సంభవించుట చేత ఈయనగారి పరిచయులు, స్నేహితులు, మిత్రులు, బాంధవులు, సహచరులెగాక ఈయనగారిని వినికనిన వారు విచారమునొందనివారులేరు.

ఆచంద్రతారకమగు నీపురుషుని కీర్తిశరీరమెగాక, స్థూలశరీరముయొక్క విగ్రహముకూడ ప్రతిష్ఠించుటకు చెన్నపట్టణవాసులందఱొక మహాసభ 1912 సం॥ జనేవరి 16 తేదిని గావించిరి. అప్పటి సభికులవలన చేయఁబడిన ప్రశంసలు 1912 సం॥ జనేవరి నెల 26 తేది కృష్ణాపత్రికయను వారపత్రికాముఖమున వెల్లడియగుటంజేసి వానిని మా చదువరుల కుతూహలము నొందించుటకు టూకిగా నిచట నుదహరింపుచున్నాను.

చెన్నపురి షెరీఫ్ మి॥ లాసన్ గారు.

ఈసభావిషయకములగు సంగతులను సుప్రకమించుదు మున్ముందు సభకుం బిల్వఁబడిన వారిలో హాజరుకాలేని గృహస్థులు సానుభూతిని కనపరచుచుఁబంపిన జాబులు, తంతివార్తలు చదివెను. అందొకటి రామస్వామిశాస్త్రిగారు సహస్ర రూప్యములను విరాళము నిచ్చుచున్నామని వ్రాసిపంపిరి. తదనంతరము ఈసభకు నగ్రాసనాధిపత్యము నావహించి ఘనతవహించిన కార్మికేలు ప్రభువువారిట్లుపన్యసించిరి:

గవర్నరుగారి బ్యాంక్వెటింగుహాల్లు నీకార్యమునకు సభికులమగుటవలనను దానికి త మంగీకరించుట వలనను అయ్యరుగారియందు తమకుండతగిన గల గౌరవము బహిర్గత మగుచున్నది.

స్నేహమమరినది. ఇట్టి విశ్వాసమే ఈయనగారిని బలవంతునిగ, జనరంజకునిగఁజేసిన మూలకారణమనిరి.

సర్ సుబ్రహ్మణ్య అయ్యరుగారు సూక్తులు:—

కృష్ణస్వామి అయ్యరు గారిని నేటికి సుమారు 24 సం॥ నుండి యెఱుంగుదుమనియు, తమపాతశిష్యులు సుందరయ్యరుగారితో మొదట చూచితిమనియు, అప్పటిమొదలు పదిసంవత్సరము లెడతెగని పరిచయము గలిగి యుంటిననియు. తమ శాక్య జీవితకాలములో నేర్చుకొనిన దానికంటె నీఅయ్యరుగారినుండి విశేషముగా దెలిసికొంటిమనియు, పరోపకార బుద్ధియె యీపురుషునికి సహజ గుణమనియు, పరకార్యమును స్వకార్యముగభావించువారనియు బలికిరి.

మఱియును కృష్ణస్వామయ్యరుగారి ధర్మగుణములను మెచ్చి 19 8 సంవ కేసరీహిందూపత్రికయును పారితోషికముగ వీరికీయబోవగ తాను మెరమెచ్చులదాత గాననియు నట్టి గౌరవమును తాను తగనని నిరాకరించెననియు, తామెఱింగినంతమట్టుకు నంత ధర్మబుద్ధిగలవారిని చూచియుండ లేదనియు వచించిరి.

కృష్ణస్వామి అయ్యరుగారి దానధర్మములు రెండులక్షల రూప్యములకు మించినవియు వీరికిం దెలియనివి యున్నవనియు వీరి ప్రతిమను సెనేటు హాలును నెదురుగ స్థాపించుటయు క్రమముచున్నామనియు పట్టపు పరీక్షలలో కృతార్థులైనవారింగూర్చి యిచ్చియున్న యుపన్యాసములలోనున్న మహావాక్యములు కొన్ని దీనిపై చెక్కబడినవి. దేశసేవయే సకలనీతిసారమని భావికాలపు హిందువులకు దెల్పియుండుననియు, ఢిల్లీ పట్టాభిషేకోత్సవమునకై మహరాజుండు ప్రయాణమైన సందర్భమందు వేదాంత శా-

స్త్రీభివృద్ధికొఱకు నొక సంఘ నిబంధన లంపిరనియు నిట్టి పవిత్ర వర్తకుని గౌరవార్థము మనమిట్లు సభ జేసితిమనియు నుపన్యసించిరి.

## స్థూలత్యాగము యొక్క రూపములు.

1. ముష్టి:—ముష్టియనఁగ గుప్పిడి లేక పిడికిలి-పిడికిటితో నిచ్చు ధాన్యము మొదలగు వస్తువులును, పిడికెను పరిమాణముగూడ ముష్టియనఁబడును. సోమరిపోతులగు నన్నివర్ణములవారును అవమానవస్ఫూర్తిగా, దేహపటిమ గలిగియుండు మిక్కిలిగ దీనికి నొడంబడుటచేత నీముష్టియనుత్యాగము మిక్కిలి నీచముగ నగుచున్నది. ఇందు నియోగిముష్టి, వెలమముష్టి యనునవి రెండు చిత్రగతులు గలవి. 'చింతచచ్చినను పులుసుచావద' న్నట్లు బింకముతో నుప్పను గింజ లిట్లు తెమ్మని నియోగియును, లంపటా లేక ఖాసాతో 'ఓరి అగుప్పెడు వేసెదరు ఎత్తుకొనిరా' అని వెలమదొరగారును, ఆజ్ఞార్థముగ నరతురఁట. వీరముష్టియును మఱియొక ముష్టికలదు ఆముష్టివాండ్రు వీరముష్టివాండ్రు. వైశ్యుల నడుక్కొని జీవింతురు. సాలీలను, పంచాననమువారిని, కోమట్లను, బ్రాహ్మణులను, మాలమాదిగెలను దేవిరించి బ్రతుకు కులములు గలవు.

2. భిక్ష:—(భిక్షము, బిచ్చము, బిచ్చ) యతులనఁగా సన్యాసులకిడు భోజనమునకు భిక్షయందురు. ముష్టివాండ్రుకొందఱు ముష్టికిబదులు 'బిచ్చ' మని యరచెదరు.

3. మధుకరము:—మధుకర మనఁగ భిక్షాన్నము లేక అడుగుకొనిన యన్నము. పామరులు రాత్రిలందు 'మాదోకావళము' అనియరచుచుఁ బట్టెడుచొప్పున అన్న మడుగుకొందురు. మధువనఁగా తేనె. తేనెనుసేయునదికావునఁ దుమ్మెదకు మధుకరమని పేరువచ్చినది. తుమ్మెద యొకపుష్పమునుండి మఱియొక పుష్పమునకుఁబోయి తేనెనుగూర్చునట్లు వేదశాస్త్రముల నభ్యసించు విద్యార్థు లింటింటఁదిరిగి మధుకరములవలె నాహారము

కూర్తురు. కొందఱు దృఢశరీరులు మాయగొంతుక పెట్టుకొని దీనస్వరముతో తమలేమి నిచెల్పుచు అన్నమడుగుకొందురు. కదలలేని కుంటివారు, రోగులు, వృద్ధులు కొందఱు అగతికులై యుంచున్నారు.

4. సంభావన:—సమ్యక్ భావనతో నీయఁబడిన మూల్యము సంభావన. అట్లుభావింపఁబడు పండితులకు, కవులకు, భట్టుకవులకు, గాయకులకు పరిహాసకులకు, పౌరాణికులు మొదలగు వారికి శుభాశుభములందు నీయబడు గౌరవసూచకమగు రొక్కము సంభావన. ఇప్పుడీ తెగలవారు దేశకాలపాత్ర భేదములచేత సన్నగిలుచున్నారు. గనుక సంభావన, కవీశ్వర సంభావనలు రూపుమాసి బీదల సంతర్పణలు, జాతీయపాఠశాలలు, కర్మశాలలు, బీదబాల రక్షకశాలలు, మొదలగువాని చందాలక్రిందనుపయోగింపబడుచున్నవి.

5. బహుమానము, బహుమతి, బహుమన్నించి యీబడినది బహుమానము. శుభకార్యములందు నాటకులకు, పండితులకు, వైద్యులకు, గురువులకునిచ్చు వస్త్రాభరణాదులును, పాఠశాలా పరీక్షల యందుఁ గృతార్థులగు విద్యార్థి విద్యార్థినీలకు నిచ్చు వస్త్రపుస్తకాభరణాదులు బహుమానములనబడు.

6. ఈనాము:—శుభవర్తమానములందెచ్చు వారికొరకు మెహనతుగఁబనిఁజేయు కూలివాండ్రు, బంట్రోతులు' పడవకోవాలు, బండివాండ్రు, పశువులగాపరులు, గుఱ్ఱపువాండ్రు మొదలగువారికినిచ్చు నీవి యీనాము. హిందూమహమ్మదీయ రాజ్యకాలములో శ్రోత్రియులకు భట్టులకు నీబడిన భూములుగూడ [illegible]నము.

7. కట్నములు:—శుభాశుభములందు ప్రత్యాసక్తిగ చదివించబడుమూల్యములు వస్త్రములు, ఆభరణములు మొదలగునవి కట్నములు. అన్నికులములలోను పెండ్లికొడుకులకుఁ గట్నములరేటు హెచ్చిపోవుచున్నది. దేహారోగ్యము, సత్ప్రవర్తనము' లోకజ్ఞాన

న, శాస్త్రవాసన, సద్వంశము, కుశాగ్రబుద్ధి మొదలగు సుగుణములు గలవాడెవ్వడును మెప్పుకెంగును. లంచములు సంభావనలున్నంత కాలమివియును సాగుచునేయుండును.

8. శుల్కము;—పేదసంసారుల కన్యలను 10, 11, 12, 13, 14, 15 ఏండ్లవయసుఁబెంచి యొకనికిచ్చి పెండ్లిచేసి గృహస్థుగఁ జేసినందుకుఁ బ్రతిఫలము సాధారణముగ ధనరూపమున నొందుదురు. ఇదియె కన్యాశుల్కమందురు. ఇచ్చట దాతలు బేరములాడి ఇంత ధనమిచ్చినఁ గన్యల నిచ్చెదమనుటచేత గన్యా విక్రయులు నింద పాలగుచున్నారు. కాని ధనవంతులగు సంసారులతో బేరములాడక కన్యాదానము చేసిన వారును పయిగా పెండ్లికొడుకునకు నల్పాధికకట్నము లిచ్చువారును గొందఱు శుల్క లాభముకంటె ననేకరెట్లు పలురీతులుగ లాభము నొందుచునే యున్నారు. ఇచ్చట అవసరము ప్రధానము. ఈయవసరము వలననే కదా వసుదేవుఁడు గాడిదకాళ్ళు పట్టెనఁట. దృష్టాంతములు జూపింపం బనిలేదు. బీదసాదలున్నంతకాల మీ కన్యాశుల్కములు ఘటింపుచునేయుండును.

ధనవంతులగు ద్వితీయవివాహ పురుషులకు నీయౌవన కన్యారత్నములే ముఖ్యాధారములు. ఇది యుండుటచేతనే ఇప్పటి యతిబాల్య వివాహములు కొంతవరకు తగ్గిపోవుచున్నవి. రజస్వలా కన్యాదానములు దినదినము హెచ్చి దేశమునకు దొడ్డ మేలుచేయుగాక.

9. మామూళ్ళు:—బంట్రోతులకును, మొహరం, దసరా, మొదలగు పండుగలకు చుట్టుకొను నౌకర్లకును, టపాబంట్రోతులకును, పాలీనాగా నిచ్చు దానములు మామూళ్ళనబడును.

10. బరాతములు:— జమీందార్లు తమయాశ్రితులకు, నౌకర్లకు; బంధువులకు, రయితులకు, మునసబు, పెత్తనదార్లకు, గరణములకు, పాలీనాగా నిప్పించు రొక్కములు, బరాతములు. ఇవి భూరూపకముగ నుండినయెడల నిమేబసులందురు.

11. లంచములు:— ప్రతిఫలమాంగోరి కార్యములనగ ప్రజలుద్యోగస్థులకు నిచ్చుధన ము లేక మరి యితర రూపకమైన సొత్తు లంచము. త్యాగములలో నీవిధము దొరకన ివారు లేరనుగనెంచి దానికి నిర్వచనాదులేర్పర్చి శిక్షకు కారణములుగనెంచి యిందాన్య శాస్త్రస్మృతిలో చెప్పెను.

“లంచములేనిమాట పుంజములేనిబట్ట చెల్లవు”, అనులోకోక్తిగలదు. ఇందువలన లంచముయొక్క సత్తా లోకానుభవ పూర్ణులకుం దెలియును. త్యాగశబ్ద మహిమాజాలము ‘లంచమందుకూడదూరి ఒకానొకప్పుడు తిమ్మిని బెమ్మినిగాను బెమ్మిని తిమ్మినిగాను మా ర్చును. ఇంగుకనుభవమే ప్రమాణముగాని వేన్నాక్త నవసరములేదు. శుల్కములు, లంచ ములు, వ్యవహారములో నవసరముంబట్టి మానజాలవు.

వ్యవహారములో కార్యసాధకులు నాలుగుపాయములు బనాయింతురు. అవి సామము, దానము, భేదము, దండము, అవి నాలుగు. ఇందురెండవది దానమనునది. ఈ దానము శ్రీగ్రంథము విశదించు 14 వ త్యాగరూపమగు దానశక్తులో చేరదు. ఇదొ క విధమైనత్యాగమని కొందరితాత్పర్యము. (పొలిటిక్సు Politics) అను అర్థశాస్త్రప్ర కారము రాజులు రాజ్యసంపాదనముకై గాని తదితర హక్కులకై గాని యొకరితోనొకరు పోరాడునప్పుడు అవసరముంబట్టి సంధిచేసికొందురు. అందులో ఇచ్చిపుచ్చుకోవడము త టస్థించునప్పుడా యీగినిదానమందురు. ఇదిలోకానుభవముగల మాదృశులకు సులభము గనే బోధపడును.

ఇట్టి వ్యావహారికోపాయములగు సామ, దాన, భేద, దండములుగాక, 1 మా య, 2 ఉపేక్ష, 3 ఇంద్రజాలము అను మూటిం జేర్చి కొందఱుపండితులు సప్తోపాయ ములందురు. మఱియును కామశాస్త్రజ్ఞులయొక్క ప్రకారము ఉపాయములు ఆరు:— సామము, దానము, భేదము, నతి, ఉపేక్ష, రసాంతరము, అనునవి. దానరూపము లిట్టి

వివిధములయ్యును త్యాగగుణమును గ్రహింపఁజేయుచుండును. తద్వారా కీర్తివిస్తారి పించేయును.

12 కానుకలు:—సామంతరాజులు రారాజులకును, ప్రజలు ప్రభువులకు పట్టము గట్టు వేళలందును దసరా మొదలగు ఉత్సవములందును నిచ్చునివి కానుకలు లేక నజరులందురు. ఈకానుకల పద్ధతి 12 డిశంబరు 1911 జనవరిలో ఢిల్లి దార్బారుసమయమున నిషేధింపబడెను.

13. అక్షయపాత్ర:—ఇది వైష్ణవాచారములోఁ బుట్టినపదము. వారిలో సన్యాసులు 5 ఇండ్లకడ తిరిపె మెత్తుదురు. వారికి బిచ్చమిడుపాత్ర తరిగిపోక బియ్యముతో నిండియుండునని వారినమ్మకము. అందుచే నాపాత్రకు నక్షయపాత్రయన క్షయముకాని పాత్రయని యాపేరువచ్చెను. కాబట్టి ముష్టికిబదులు అక్షయపాత్ర యని వైష్ణవులు, స్మార్తులును యనుకొందురు.

14 దానము (ము:దాళ్-దానమిచ్చుట) ఇదిత్యాగశబ్దమువలె పైవివరించిన యీవులకు సామాన్యపదమైనను "దానము,, దానప్రతిగ్రహణము షట్కర్మలలో కర్మలుగా పాలించుదురు. పర్వదినములందును, యాగాదికర్మలయందును, నైమిత్తికములయందును; క్షేత్రములయందును సంకల్పపూర్వకముగ గంభీరవాక్కులతో దంపతులు సువర్ణ, రజిత, ఫల, ధాన్య, కన్య, భూ, సాలగ్రామాదుదానములు చేయుదురు. ఇవి దశలేక షోడశమహాదానములుగ పరిగణింపబడును. ఇట్టిత్యాగములో దానమునిచ్చువానికి "దాత,, దానము పట్టువానికి "ప్రతిగ్రహీత" యందురు. తక్కిన యీవులకు నింత ప్రశస్త్యాసక్తి యక్కర లేదు. ఒక డబ్బు, అణా, ఒక ఫలము ఒక వస్తువు కొందఱకు నిచ్చినయెడల పుచ్చుకొనును. ముందెడునావులు మీరు సంకల్పవిధానముగ 'తిలదానం తుభ్యమహం సంప్రదదామి' యని సంస్కృత వాక్యము

లోఁ బడియుయ్యబోయిన సాధారణముగఁ బండితుఁడయిన శ్రోత్రియ బ్రాహ్మణుఁ డట్టి తిలదానమును గ్రహింపఁడు. మనదేశమున దాతచేసినపాపములు దానములోగూడ శ్లో॥ యజమానకృతంపాప మన్నమాశ్రిత్య తిష్ఠతి। తదన్నం పాటిగృహ్ణీయా త్ప్రైతికం తగ్గతేరపి, అని చెప్పినప్రకారము దానము పట్టిన వాండ్రు యజమాని పాపముకొంత చుట్టుకొనునని నమ్మికకలదు. ఈపట్టింపుచేతనే లంచములు తీసికొనువారి యిండ్లయందును మోసము, దగా, తప్పుడుసాక్ష్యము, దొంగతనము, దోపిడిమొదలయినగ నార్జించువారి యిండ్లయందును, దుర్దానములు పట్టెడు, దురాన్నములు తినెడు వారిండ్ల యందును భక్తితో పిలచినను ప్రాణాలు పోవుచున్నను కొందఱుశిష్టులు భుజియింపరు. యాచించిరైనను శ్రోత్రియుని యన్నము తినుట కుక్షిపావనమనియు నది దొరకనప్పుడు దరిద్రపావనము వల్లనైన ప్రాణము రక్షించుకొనవలసినదనియు వారి యభిప్రాయము. ఇందుకు లక్షణము:—

శ్లో॥ యాచయేచ్ఛ్రోత్రియస్యాన్నం తదభావేఽలంపి వేత్ ॥

15. దక్షిణ:—దానములతో నీయబడు రొక్కమునకు దక్షిణయందురు. దానముపట్టువానికి దాతనుండి సంక్రమించిన దోషమును తొలగించు సమర్థత కలుగుటకుగాను దక్షిణీయబడుచున్నదని కొందరి తాత్పర్యము. దక్షత యనగ సమర్థత. "దానసాద్గుణ్యార్థం దక్షిణ దానం కుర్యమహం సంప్రదదేనమమ" అని చెప్పుటకు కారణమిదియె. దానముపట్టినదోషము తొలగించుటకు సమర్థత నిచ్చునదికాగా దక్షిణ అయినదని కొందరి మతము.

15. దూర:—భరతఖండవాసుల ధర్మకార్యములలో సప్తసంతానములగల్గు:—

శ్లో॥ తటాకం ధననిక్షేపం బ్రహ్మస్థాపత్యం శివాలయం

ఆరామ కృతి కూపాశ్చ ఇతి సంతాన సప్తకం॥ దీని తాత్పర్యము:—

1. చెరువు త్రవ్వించుట. 2. ధనమును పాతిపెట్టుట. 3. బ్రాహ్మణాగ్రహార నిర్మాణము, 4. దేవాలయ స్థాపనము, 5 వనప్రతిష్ఠ, 6 కృతినందుట, కృతినిచ్చుట, 7 కూపనిర్మాణము. ఇందు వనప్రతిష్ఠయనగ ఫలభరితములగు మామిడి, పనస, మొదలగు తోటలు పెంచి ఫలము ధర్మము చేయుట. తోట పెరిగి ప్రథమమున ఫలభరితమగు వృక్షము తొలిపండ్లు బ్రాహ్మణులు, సత్పురుషులు, భుజింపక గాని యజమానులు భుజింపరు. కాబట్టి ఫలోన్ముఖము కాగా దానిని బ్రాహ్మణులకు చూరవిడుతురు. అనగా యథేచ్ఛగ వారువారు మోయగల ఫలములను మోసికొని పోనిచ్చెదరు. ఈపనికే 'చూరవిడుచుట' యనివాడుదురు "చూర" శబ్దము, 'చౌర్యము' చోరత్వము నుండి పుట్టిన పదమైనను, దేశ రివాజును బట్టి యిచట చౌర్యముకాదు. మంచిపనియే.

17. ఉపాదానము:—ఉపపాండవులు, ఉపాఖ్యానము, ఉపవిభక్తి యన్నట్లును ఆంగ్లేయభాషలో "లా" కు "బైలా" యన్నట్లును దానమునకు ఉపదానము గలదు. కొందఱు యాచకులు లేక ముష్టివాండ్రు ఉపాదానమని యందురు. దీనికి బిచ్చమని యర్థము.

18. యాయావరము:— (దీనితద్భవము అయవారము) ఈపదము ధాన్యము యాచించెడు వారికి చెల్లును. అయితే విప్రగాండ్రలో కొందఱు బ్రాహ్మణులు తమ యజ్ఞానము దెలుపుటకు 'వ్యాయవారము' నియందురు. ఈ గ్రామ్యపదము కొందరు సామాన్యులు హేళనగ ఏడువారములపైది తొమ్మిదవ వారమునకు చెల్లునందురు. (యాయాతాయావృణీతయితి యాయావరము) సీతారామాఖ్యానము, రామచంద్రస్వామియం పరిపాహుదేవ, తిరుపతి ఘోశరణం మొదలగు వాక్యములను వానిలోనున్న పరమార్థము నెఱుంగక ముష్టివేయుడు. బిచ్చము పెట్టుడు అను మాటలకు ప్రతిపదములుగ భావించి యుండెంటమనుకుందు కొందఱు పాయక సోమరి జీవస్వార్థులును, వైష్ణవులును వాగొను-

-చున్నారు. వీరు కొందఱు తిథి, వారము, నక్షత్రము మాత్రము చెప్పుచున్న కొందరు పంచాంగముయొక్క అంగములెరుంగరు కాబట్టి నక్షత్ర,యోగ, కరణములు చెప్పలేరు.

19. గూఢచౌర్యము లేక చిత్రవిచిత్రగతుల ద్రవ్యాపహరణము:—హస్తలాఘవముతో హరించుట, జారవిడుచుట, బట్టలో ముడిచి లేక చెంగుతో మూసికొనిపోవుట, తక్కెడయొక్కతట్టు దిగబడునట్లు సరకు విసరివేయుట, చెక్కపట్టికొలుచుట అది మికొల్చుట, నిండురాశిమీద కొలపాత్రతో సరకు త్రోసివేయుట, పిచ్చుపడికట్లు, పిచ్చు కొలపాత్రలుపయోగించుట దబ్బెత్తు అనగ 1½రూపాయి లేక నోటులను అరుచిన్న ములయెత్తుకుబదులుగ ఇప్పటి క్రొత్తరూపాయితో గాని అర్ధణాకాసుతో గాని కిరాణాసరకులు తూచి కోట్లకొలది నిరక్షరులను సాక్షరులను మోసముచేయుట గూఢచౌర్యమనదగు. ఇది కొందఱుకటబ్రాహ్మణులు, కొట్టుమీద పెత్తనముచేయు గుమాస్తాలు, కోరలమీద నుండుద్యోగస్థులు, తోటమాలీలు, తూచెడు కొలిచెడు వర్తకులు, చిల్లరదుకాణదారులు, పాళ్యపు సేద్యముచేయు రయితులు, సంతలలో పదకులు తూచెడు కొలిచెడు వర్తకులు సామాన్యముగ నీగూఢచౌర్యమునందు నేర్పరులయ్యున్నారు. కొలిచెడు, తూచెడు, లెక్కించెడు వర్తకుల దుష్ప్రవర్తనవిషయమై వాడుకలో నున్న శ్లోకము:—

శ్లో॥ మానేనకించిత్తులయాథకించిత్ మానేనకించిత్కలహేనకించిత్ ।
కించిత్కించిత్పహరన్యశేషం వణిక్స్వహస్తాదపి శేషచోరః॥

దీనికి తాత్పర్యము—కొలుచుటలో కొంచెము, తూచుటలో కొంత, మానము చేతమతి కొంత, కలహముచేత నింక కొంత, అశేషము కొంచెము కొంచెము చొప్పున వర్తకులు హరింతురు కాబట్టి యిట్టివర్తకులకంటె మించినచోరులు లేరు. పాళ్యపు సేద్యముచేయు రయితులవిషయము చాటువాక్యముగానున్న శ్లోకము—

ఖలేపాదంత్వగేపాదం పాదంపర్యటతేవశః।
లంబోదరగణేశాయ (పాఠాంతరము)
పోతరాజగణేశాయ సర్వంహారతి సింగనః॥

కళ్ళములో నాల్గవవంతును, గడ్డిలో నాల్గవవంతును, పోతరాజునకు పాతిక వంతును, గణపతి కొకనొక పాతికయు నిచ్చిప్పను పాలు అంబారముల పంట యంతయును సింగనయనురయతు హరించెను.

20. చందాలు:—ఈవిషయమై పండితులు, పామరులు, సంఘావాధి పతులు, జమీందారులు, జాగీరుదారులు, రయతులు, వర్తకులు, సాహుకార్లు, కంట్రాక్టరులు, ఉద్యోగస్థులు, వైద్యులు, వకీళ్ళు మొదలగు ధనికులు గౌరవార్థముగను, స్వపరలాభార్థముగను కొందరు ముఖ్యముగ పరమార్థముగను కొందరు చల్లచల్లగ దివాలాపాట్లుగు ...కుము నీత్యాగమొనర్చుచున్నారు.

21 లాటరి:—వందలు, వేలు, లక్షలకొలది ధనము దొరకునను పేరాసతో నీ మోస్తరు ఛాన్సు, లాటులేక నశీబు అనగా తల్రవ్రాతమనబ్బు 1-2-3-4-5-10 రూప్యము ల చొ॥ లాటరీ చందాలువేయుదురు. ఒకొక్కడు పేరుఫలమను భ్రమచేత మూర్ఖురునలు గురి శేళ్ళతో వేయించుటయు గలదు. చాలమంది యుద్యోగ నూటికి కోటికి నొకడు సంతోషించునీమార్గము కొందరికి నవనాగరికులకు తగిన పని గన్పట్టుచున్నది. నాత్స్కలు ద్ధితో విచారింపగనిట్టి (speculation) కోధా యొకవిధమైన జూద్యాతమనదగియున్నది ఇట్టిదానిని వ్యసనమని కొందరు పండితులు తలంచెదరు.

22. ఋణము:—ఋణదాతయను వాడుకనుబట్టి యిదియుంగూడ త్యాగములో చేర్చ తగిన విషయమైయునది. ఋణములు తెచ్చుకొని పెండ్లిండ్లు చేసికొనినవారెందరో నిదానిం పుడు. ఋణప్రతిగ్రహీత తీర్చినను తీర్చకపోయినను 'వానినొకయింటివానిగఁ జేసితి గద'

యును సంతుష్టి ఋణదాతపొందును. ఋణదానము వ్యవహారవిషయమయినను కొంతవఱకు పరమార్థవిషయముకూడ చేరియుండును.

ఋణము చేబదుళ్ళనియు స్థిరచరముల కుదువబదుళ్ళనియు ద్వివిధము. ఋణస్థు లందఱిలో ఋణము సంపూర్తిగగాని అసంపూర్తిగగాని తీర్చలేని వారు కొంద ఱుందురు. ఇందు కాలదోషవిధి పాలకు లేర్పరుచుటచేత సదరు దాతపరిగ్రహీతులు వాది ప్రతివాదులై కోర్టులకుం బోదురు. ఇక్కాలమందు దేశసంపద లభివృద్ధి జెందుటచేతను విద్యాబుద్ధులు ప్రాబల్యమొందుటచేతను (Litigation) దావాలు హెచ్చిపోవుచున్నవి. ప్రజాభివృద్ధి యయినకొలది వ్యాజ్యములసంఖ్య హెచ్చి స్మాలుకాజులు, పెద్ద కాజులు, భూవ్యాజ్యములు, వారసత్వదావాలు, సమ్మేరిదావాలు మొదలగు ఖాపతులుకూడ హెచ్చి న్యాయస్థానములు (విలేజి మునసబు, సబ్బు, సివిలు, హైకోర్టులనుపేరిట) ప్రబలినవి. ఇన్ని కోర్టులను కల్పించుటకును పెంచుటకును ఋణస్థులు ఋణదాతలే కారకులు, ఆధారులు. ఇంతియకాదు వీరు న్యాయతీర్పరులకు న్యాయవాదులకేగాక న్యాయ శాస్త్రములు (Acts, Codes, Rule) నిర్మాణముచేయు చట్టనిర్మాణకులకు మిక్కిలిగ పనిపెట్టుచున్నారు. ఇట్టివ్యవహార వైభవమును వర్ణించుటకు పెద్దగ్రంధములుపట్టును. కాన ఇట్టిశాస్త్రగరీతి వర్ణన విరమించుచున్నాను.

## స్థూలత్యాగఫలితార్థమం.

త్రికరణశుద్ధితో చేయు మేలు, న్యాయము, దానము, సుకృతము ధర్మమనవచ్చును. పైన వివరించిన వివిధరీతుల త్యాగమును, ధర్మమున చేరును. దాన ధర్మములలో పారమార్థిక పాత్రవినియోగము మొదలగు లోపములు దటస్థించినంతమాత్రముచే ధనిఘనతకు కళంకము రాదు.

'యతో ధర్మ స్తతో జయం' ఎచ్చట ధర్మముండునో యచట సర్వోత్కృష్టత యుండును.

'త్యాగానుసారణీకీర్తిః' త్యాగము ననుసరించి కీర్తి ప్రకాశించును. అన్నట్లు భారతీయుల త్యాగమునుబట్టియును హైందవములగు పశు పాషాణ పాదపము లిచ్చు సంపత్తునుబట్టియును దాన ధర్మములలోను, భూతదయలోను, భరతఖండము లోక మందున్న యితరదేశములకు గన్నమై యున్నది.

ప్రస్తుతజనాభా లెక్కలను బట్టియు మనదేశపు యెగుమతి దిగుమతి బూతాదు (Food stuffs and grains) సరకుల లెక్కలంబట్టియు నాటునవచ్చు పోవురస్తులో బూతాదుసరకులను బట్టియు నన్నము లేక జీవనార్థము భరతఖండము నాశ్రయించు చున్న పరదేశవాసుల సంఖ్యనుబట్టియు అన్నమునకై యితరదేశముల నాశ్రయించుకొని యున్న భారతీయులసంఖ్యనుబట్టియు నితరదేశములకు మనదేశమిచ్చుసరకుల వెలనుబట్టియు మనకు నితరదేశములిచ్చు సరకులవెలనుబట్టియు మనదేశ సంపత్తుయొక్క ఆధిక్యతను తెలిసికొనగలము. అనగ మనదేశమె కాలక్రమమున హెచ్చుగ నితరదేశములకు నిచ్చుచున్నది ఇందుకు ప్రత్యక్ష నిదర్శనము:—

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| అన 1909 సం॥ | మనయెగుమతులవెల | రు 194 కోట్లు | దిగుమతులవెల | రు 160 కోట్లు |
| 1910 సం॥ | ,, | ,, రు 217 కోట్లు | ,, | ,, రు 173 కోట్లు |
| 1911 సం॥ | ,, | ,, రు 230 కోట్లు | ,, | ,, రు 197 కోట్లు |

(కృష్ణాపత్రిక Vol 11 No. 14 ది 8 జై 1912 చూడండి)

'అమ్మా' 'అయ్యా' అనిదేవిరించి యడుగుట యెంతకష్టమో, యెంతనీచమో లేదనుటయు నంతకష్టమే ఈరెండును అష్టకష్టములలోని కష్టములు ఇందుకు—

శ్లో॥ దాసత్వంచ దరిద్రంచ దారాహీనం స్వయంకృషి।
దేహినాస్తి ఋణంపంథా అష్టకష్టాః ప్రకీర్తితాః॥

1 సేవ, 2 పిసినితనము, 3 భార్యావియోగము, 4 స్వంతసేద్యము, 5 అనుకొనుట, 6 అడిగినలేదనుట, 7 ఋణబడుట, 8 నిరంతరప్రయాణములు. ఇవి యష్టకష్టములు. మఱియు దేహీయనఁగ ఇమ్ము, పెట్టుము, అని చెయిజాచి యడుగనివాఁడును అట్లడిగినప్పుడు లేదన కిచ్చువాఁడును, త్రికరణములా సత్యము పలుకువాఁడును, రణమందు మడమ త్రిప్పనివాఁడును, పౌరుషవంతు డగుమహాపురుషుడనియు, అట్టివారింగన్న తల్లిదొతల్లి. ఆ మెరయే యదృష్టవంతురాలనియు వినుచున్నాము. ఇందుకు పద్యము:—

ఉ॥ నోచినతల్లికి న్సుతుఁ డమోఘవ్రుఁడొక్కఁడె చాలు మేటి చే
జాచనివాఁడు వేఁడఁగడు జాచిన లేదన కిచ్చువాఁడు నో
రాచి నిజంబెకాని పలుకాడనివాఁడు రణంబులోన పై
దాచనివాఁడు భద్రగిరి దాశరథీ కరుణాపయోనిధీ॥

పునర్జన్మయందు నమ్మకముగలిగిన నవనాగరికులీ వ్యాసమును జదివినప్పుడీ విషయమును:—

శ్లో॥ అదానదోషేణ భవేద్దరిద్రః। దరిద్రదోషేణ కరోతిపాపం
పాపాదవశ్యం నరకం ప్రయాతి। పునర్దరిద్రీ పునరేవపాపీ॥

అను శ్లోకమునుబట్టి పూర్వజన్మమందు పెట్టనివానికి నీజన్మమందు పుట్టక దరిద్రుడగు కదా? దారిద్ర్యమువలన పాపకర్మలు చేయును కదా? అట్టి పాపమువలన నరకప్రాప్తియే కదా? ఇట్టివానికి దెంపులేక జన్మజన్మములందు దరిద్రుడై పుట్టుట, పాపియైచచ్చుట తప్ప వేరొగతి లేదుగదా? ఇందువలన పూర్వజన్మమున పెట్టుట యనునది సంభవింపవలెనా లేదా? అటుల పెట్టుటకు కలిమి యుండవలెగదా పెట్టుటకు. కాబట్టి కలిమి తప్పు మార్గమెట్లు? లేని యిట్టి మార్గము తెలియఁజేసి తప్పించుకొని యుత్తము

జన్మ చెంది క్రమముగా గొప్పపదవి నొందుట యెట్లు? అను ప్రశ్నలు వేయగలరు. అందుకు సమాధానము:—

(ఈ సమాధానము దీర్ఘముగ వివరించితిని గనుక విసుగుజెందక విని వివరింపుడు.)

ఈ విశ్వమునకు బ్రహ్మాత్మశక్తి యను నొకమహాశక్తి హేతువైయున్నది. ఇది చంద్ర చంద్రికాన్యాయమున బ్రహ్మమేకాని వేరొకటికాదు. సంకోచావస్థ (involution) అనగా అవ్యక్తమందు నివృత్తియం దచలమై అంతర్ముఖమై బ్రహ్మమేకాని వేరుకాదు. వికాసావస్థ (వ్యక్త-ప్రవృత్తి) (Evolution) యందు విశ్వ మయి పరిణమించును. అవ్యక్తమహదహంకారాది రూపకమై యుండును. ఈ మహాశక్తికిఁ ద్రిగుణాత్మిక యని పేరు. త్రిగుణములు సత్వ రజ స్తమస్సులు. వీని మిశ్రముచేత సూరేకారము, గంధకము, బొగ్గులకలిడి వలన వందలవేల విధములు గల బాణాసంచా యయినట్లు బ్రహ్మాది జీవకోట్లు భేదగుణములు గలవారగుదురు.

ఈజీవు లొకేపని చేయునపుడు ఎట్టిభేదగతుల పాలగుచున్నారో చూడుడు:—

మీ సేవకులు ఎ, బి, సీ లనువారు ముగ్గురు వరుసగా నొక్కొక్కరుగ మూడుదినములు బజారునకు కూరలనిమిత్తము పంపితిరనుకొనుడు:—

మొదటిదినమందు ఎ అనువాడు దారిపోవుచుఁ బ్రక్కను నిద్రింపుచున్న కుక్కనుచూచియు దాసీనభావముతో దన పనిమీదబోయి దానిని నిర్వర్తించును.

రెండవదినమందు బీ యనువాడు నిద్రించుచున్న నిన్నటి కుక్కనేచూచి కొట్టు కుక్కయని సందేహించి యాదారింబోవక మారుత్రోవంబోయెను. ఆలస్య మమృతం విషమన్నట్లా దినమందు వలయుకొన్నికూరలు లభింపకపోవుటయును, తక్కినవి హెచ్చువెలకు దొరకుటయును, ఘటించెను. అందుచే యజమాని వానిని మఱియొకనీచపు పనిలో పెట్టెను

మూఁడవదినమున 'సి' యనువాఁ డాదారినే కూరలకుంబోవుచు నిద్రింపుచున్న సదరు కుక్కనుజూచి యది కరచునను భయముచేత దానిఁదొలఁగింపవలయునని దానిమీఁద రాయిరువ్వెను. అది మర్మస్థానమందుఁ దగిలి యాకాట్లకుక్క యదరి బెదరి కోపావేశమున వానిం దరిమి కాలిం గఱచెను. కాటు లోతుగ దిగుటచేతను, పరుగిడుటలో తన బట్ట యూడివిడి కూరలకిచ్చిన రూకలు జారిపోవుటయేగాక కాలికిఁగూడ దెబ్బతగిలి గాయమాయెను. సి, యి ట్లాత్మయాధితోను, భౌతికయాధితోను ద్రవ్యనష్టమునొంది కూరలులేక యజమానియింటికిఁ బోయి యా వృత్తాంతముం జెప్పి యా యాకస్మికము వలన దటస్థించినబాధకయి ౨, ౩, వారములు మంచముఁబట్టి తిరిగి కాలు క్రిందఁ బెట్టఁగలిగెను. ఇట్టి తొందరపాటుగల నాకరవర్తనములకు మూలమని యజమానుఁడెంచి వాని నౌకరీలోనుండి తప్పించెను.

ఇట్లు కూరలు తెచ్చుటలో ఏ, బి, సి, లను ముగ్గురు మూఁడువిధములగు ఫలముల నొందిరి. ఇంతయేల పాశ్చాత్యులనగ పోర్చుగలు, హాలండు, ఫ్రాన్సు, ఇంగ్లాండు దేశ సంఘములవారు తూరుపునకువచ్చి యెట్టిఫలముల నొందుచున్నారో చూడుఁడు.

వివిధజీవుల గతులిట్లు పలుత్రోవలయియుండును. జీవులెంత బీద దశలో నున్నను గుణముచేతను, కర్మచేతను, ఇహమందె సంపన్నులు నగుదురు. దరిద్రులునగుదురు.

ఇట్టి స్వగుణ స్వకర్మజాలచేతనే కలిమిలేములు, సుఖదుఃఖములు తటస్థమగుసు. వానితోడనే పుణ్యపాపము లతిశయించును. వానితోడనే క్రమంబుగ నుత్తమాధమ జన్మంబులు చేకురును. బీదవానికి దానధర్మములు పరోపకారములు సలుపుటకు ధనములేక సావకాశము లేదన వలదు. దారిం బోవుచుండ నొక గ్రుడ్డివాఁ డసహాయుఁడై కఱ్ఱతో తడుముకొని పోవుచు దారిఁ జూపుఁడయ్యా యని యడుగు నపుడు వానికి దారిచూపి గమ్యస్థానమున బ్రవేశపెట్టుట తప్పుడుదారిపట్టి నప్పుడు దా

-టపారులకు సరియైన త్రోవజూపుట దుఃఖపీడితులకు, జనులకు కర్తవ్యములో చనివారికి, సద్బోధనలచేత నుపశమనము గలుగజేయుట, తెలివి తక్కువతో పనులు నడుపు వారికి, కష్టము, నష్టము, హానిలేకుండ నుద్బోధించుట సోమరితనముచేత పేదవడినవారికి బ్రతుకు తెరవులుజూపుట. నిర్వ్యాపారులకు వ్యాపారము గల్పించుట మొదలగు సత్కార్యములు త్యాగమునఁజేరుచున్నవి. ఇట్టిపనులుజేయువారును త్యాగులె. త్యాగమునకు ధనమొకసాధనమైనను ధనమే ముఖ్యాధారముకాదు తనకాలము, తనదేహము, మనోబలములు, తన యవ్వనము, తనయుపదేశములు, సలహాలు, తనకన్నులు, కాలుచేతులు, తనమాటలు, తనరేకలు, తనకూకలు, సైగలు మహోపకారములగు త్యాగసాధనములగును. ఒకప్పుడు చెడ్డపనియుగూడ వివేకముతోను, జ్ఞానముతోను నెరవేర్చబడు నపుడు ప్రాణదానమునకు సాధనమగును.

ఈవిషయమై యొకకథకలదు:—ఇది చేంబర్సు మోరల్ క్లాసు పుస్తకములో నొక కథాసంగ్రహము:—

ఒకానొక గొప్ప చిత్రకారకుఁడొక దివ్యమందిరములోనున్న లోపలి భాగమును మరామ్మతుచేయుటలో దానియందము పరిశీలించుటకై వెనుక వెనుకకు నడచి దానిం జూచుచుఁబోవుచుండెను. ఆమందిరముయొక్క (Terrace) డాబాకు కటకటాలు లేమింజేసి యాచిత్రకారుఁడు ఇంకొక అడుగు వెనుకకువేసిన క్రిందికి రాలిపడి చనిపోవునంత చేరువలోనికివచ్చెను. ఆశిల్పి దృష్టియాంతయు చిత్రించిన ప్రతిమమీఁదనె నిలిచియుండెను. రెప్పపాటులేక తదేకదృష్టితో నడుగిడువాఁడు ఇఁకనొక అంగలో మృత్యునోటఁబడవలసినదె. ఇట్టి దుర్మరణమును వీక్షించి యుపాయాంతరము తోఁచక యాశిల్పిచెంతనున్న యాతనిసేవకుఁడు చిక్కని ముంతెడురంగును ఆచిత్తరువుమీఁద విసిరివేయఁగ దాని రూపుచెడి వానిలక్ష్యము విఫలతనొందించెను. ఛటాలున కోపావేశుఁడై ముందున్న యా నౌకరుం గొట్టుటకు తిరిగెను.

దీనికి హేతువు విచారింపఁదగిన శాంతస్వాంతుడయి హేతువు నెఱింగినప్పుడు తినయకాలమరణము దప్పించిన యానాథుని తనప్రాణదాతగ నెఱింగెను. ఆసేవకుని తెలివితేటలు, అతనియుపకారము ఇంతింతయని యెన్న తరముగాదు.

ఇందుచేతనే అరిష్టానిష్టకష్టములు తటస్థించునప్పుడు సాధువులు, భక్తులు, జ్ఞానులు, వానినట్లుగఁ దలంపరు. ఒకయరిష్ట మొదవునపుడు దానిని దురదృష్టచిహ్నముగ గణింపరు. దానికంటె శతమడుంగుల యరిష్టము దప్పించుటకయి యప్పటికిఁ దటస్థించిన సాధనాంతరముగ దానిం భావింతురు. "యద్భావం తద్భవతి" యను వచనముప్రకారము ప్రతిసంగతి మేలేయని తలంచువానికి మేలె నేకుడును. ఇందుకు లక్షణము:—

'శ్లో॥ యాదృశీభావనా యత్ర సిద్ధిర్భవతి తాదృశీ'

కొందఱు 'ధర్మమేజయము' 'మంచముందు చెల్ల గొడువుగాదు' అను వాక్యములయందలి రహస్యమెఱింగిన ఘటికులు స్వార్థపరిత్యాగమునకు వెనుకదీయరు. ఒక నూతన పాఠశాలోపాధ్యాయునికి మంచిపేరు రాకపోవుటకు చింతించి కర్తవ్యాంశము స్ఫురింపక తన స్నేహితుండగు నొక వృద్ధునికి సలహానిమిత్తమై జాబువ్రాసి పంపెను. ఆ వృద్ధుండు పాలనాశక్తియందును లోకానుభవమునందును ప్రవీణుడుగాన.

"The less you claim The more you will have"

ఎంతతక్కువకోరిన నంతయెక్కుడగుఫలంబులు చేకురు ననియుండెను

అను మంత్రోపదేశముంజేసి సదుత్తరమంబంపెను. దాని యర్థముగ్రహించి యా యుపాధ్యాయుడు కృతకృత్యుండాయెను.

ఇందుకు నొక దృష్టాంతరము:—

రోంసామ్రాజ్య మహాయుగములో ఆక్టేవియస్ మొదలగు ఘటికులు రాజ్యాధికారము వహించినప్పుడు పాత మేజిస్ట్రేటగు ప్లాంకస్సును పట్టుకొని చంపుటకు నుత్తరువులు పొందియుండగా నాతడు పరారియయ్యెను. అతని దాసునాకర్ణను రాజభటులుపట్టి నీయొడయుండెచ్చటనుండునో చెప్పుమన్న పట్టిపల్లార్చినను చితలబెట్టుచుండిరి. అట్లు బాధించినను తన యజమానుడు దాగియుండు తావుం జెప్పమనిరి. మరింతవంతలబెట్టుటెరిగి యావిశ్వాసపాత్రుడగు తనపాలనాకర్ణం గోలుపోవుటకంటె తానెసమయుట సముచితమని కృతనిశ్చయుండై తనయజమానులున్నంత వెడలివచ్చి తనగులాముల చిత్రవధను దప్పించుటకై వారిపైంబడు దొరతనమువారి కత్తివరుసలకు నడ్డంబాయెను. ఆహా! ఏమీవింత ప్రభుసేవకపరస్పరప్రేమ విశ్వాసాభిలాష !!! కనుడు చదువరులారా!

"స్వదత్తాద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనం"

అను మహావచన ప్రకారమాప్లాంకస్ యొక్క యౌదార్యమునకు విరోధి యధికార బృందము కఱిగి వైషమ్యము త్యజించి యాసేవకుల యాపన్నివారణచేయుట యే గాక యాప్లాంకస్సును సైతముమన్నించిరి. (ఛేం. హి. క్లా. బుక్కు). ఈకథః స్వార్థపరిత్యాగమునకేగాక ప్రభుసేవకా పరస్పరానురాగమునకుంగూడ దృష్టాంతమైవిలసిల్లును.

ఇట్లు త్యాగము, స్వార్థపరిత్యాగము జగత్త్రయమందును విలసిల్లుచు నిహమునందేగాక పరమునందును ద్విగుణ త్రిగుణముగను కోటిగుణముగను ప్రకాశించును. ఈ విషయమున ద్వాపరమందు శ్రీకృష్ణభగవానులు తనకు నొకదళముగాని పుష్పముగాని ఫలముగాని యుదకముగాని భక్తితో సమర్పించినయెడల ప్రీతితో నారగింతు ననిరి.

శ్లో॥ పత్రం పుష్పం ఫలం తోయం। యోమే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత। మశ్నామి ప్రయతాత్మన.

ఇందుకు నిదర్శనముగ త్రేతాయుగమందు భగవంతుడు శ్రీరామ రూపము దాల్చినప్పుడు శబరియను వనచరస్త్రీ శ్రీరామునికై వనవాసములో నొకదినము పండ్లుగూర్చి

శబరియు వన్యములగు ఫలాదులు రుచియుండునో యను భయముచేత తాను రుచిచూచి నిరూపించిన ఫలాదులనే యిచ్చి భక్తిచే సేవించెను. ఇట్లు ప్రేమాతిశయపూర్వక త్యాగమువలన శబరికి ముక్తికలిగెను.

త్యాగమునకు ప్రేమయేగాని వస్తువువిలువ దేశకాలములు మొదలగు సంగతులతో ప్రసక్తి లేదనుటకు దృష్టాంతరము:— పారసీక రాజొకడు దేశసంచారము చేయుచుండగ నకస్మాత్తుగ దర్శించిన యొకపల్లెటూరికాపు సంభ్రమముతోను భక్తితోను తనరాజునకు చెంతనున్న యేటి ప్రవాహోదకము దోసెడు తెచ్చి త్రాగుడని యిడెను. ఆ కాపుని యొక్క నిరసత్వమునకు చిరునగవునవ్వి తనకృతజ్ఞతను సూచింపుచూ, రాజు అదియును నొకవిధమైన గౌరవమని బోధించెను. అరయగ చూపులకు పల్లెటూరుమోటు అయినప్పటికిని వానిమనస్సు పెద్దఘనమని మనసైన యుండవలెను.

వేయేల బెంజమిన్‌ఫ్రాంక్లిను క్రొవ్వువత్తుల వర్తకుని కొడుకు, వానిస్వయంకృషి చేతను స్వసహాయముచేతను చిట్టచివరకు అమెరికాలోని తన బోస్టన్ పట్టణముయొక్క రాజ్యమునకును ఫ్రాన్సురాజ్యమునకును రాయబారియై కీర్తిశేషుడాయెను.

మఱియొక దరిద్రబాలుడు క్లార్కనువాడు క్వీన్సుకవుంటీలో బెంచి మేజిస్ట్రేటు కోర్టువారి తాలూకు బెంచిని చిత్రికసుల్లతో పది పదిమారులు తోముచుండెను. ఏమి యిట్లు చాదస్తముగా పట్టినపని పట్టుచున్నావనియడిగితే యీ సీటుమీద మె॥ క్లార్కు గారు మేజిస్ట్రేటై అధిష్టించి అధికారము చెలాయించే రోజులలో వాయనకు సీటు వత్తుదా? కాబట్టి యిప్పుడె చక్కగా సాఫ్ చేయుచున్నాననగా విన్నవారందరు హేళనచేసి నవ్విపోయిరి. కాలక్రమమునయతని శ్రద్ధ, పాటు, యోగ్యత, మర్యాద, దయాంతఃకరణమువలన ధనికుడై స్వతంత్రుడాయెను. అతని సౌభాగ్యప్రవర్తన, యైశ్వర్యము, యా తెలివితేటలకార్యుని మేజిస్ట్రేటుపని చేయుయోగమునిచ్చెను. కాబట్టి సంపదలును సౌఖ్యములను కోరువారికి సాధనములు ఈ కాలుసేతులే, యీ మనస్సే, యీ నోరే, సంకల్పు

“ పారనీర్లదు మెడగాంచని పోవువాని ” యనియు జగముచుట్టను అనియు పేర్కొ-న బడును.

లోభి కూటికి గుడ్డకు దూరుడై ధనమును వదలక దాచిపెట్టును. తుదకు ధనము ను వదలలేక ధనహానికనోదకమును పానముచేసి చచ్చును. అట్టి లోభి ధనము రాజు పాలో, దొంగపాలో, దాయలపాలో, న్యాయవాదులపాలో, కాగా వాడు ఇహ మందు నిందలపాలును, పరమందు నరకములపాలు నగును.

ఇక దాతయొక్క విత్తము ‘ త్యాగ భోగాయ విత్తం ’ అన్నటుల పరులకు స్వేచ్ఛగా త్యాగముచేసి తానుభుజించుటచేత నిహమందుకీర్తియును, పరమందు సా లోక్యాది పరసుఖము నందును. ఇందుకు పద్యం;—

క. ఇచ్చినసువర్ణమెల్లను విచ్చలవిడిగా(బలోభివితరణిగాడే।
చచ్చియువిడువండర్థం బిచ్చెదవుగగాతలోభియాసోకాడో॥

ఏది యెట్లయినను త్యాగపదార్థమీ దృశ్యమాన ప్రపంచములో స్వయంప్రకాశ మానమైనది. సర్వలోకాంగ రక్షకుండని యార్యులును, ప్రావిడెన్స (Providence) అని పశ్చాత్యులును ఈశ్వరునిగూర్చి చెప్పుదురు. కాబట్టి త్యాగులకు నీశ్వరుడె పూర్ణత్యా గియని తెలినది. ఇట్టిదేవాంశయగు త్యాగగుణముగల తనభక్తులకు వారివారి పాత్రతలంబట్టి కొందఱికి సాలోక్యము, కొందఱికి సామీప్యము, కొందఱికి సారూప్యము, మఱికొం దఱికి సాయుజ్యము మొదలగు వివిధసుగుణముక్తులను ఈశ్వరుడిచ్చుచున్నాడు ఇందుచేత నా ఈశ్వరునికి “ త్యాగరాజు ” “ వరదరాజు ” నిపేర్లు.

ఆరోగ్యంభాస్కరాదిచ్ఛేత్। మోక్షమిచ్ఛేజ్జనార్దనః॥

అన్నట్లు యిట్టి త్యాగములకు ప్రభుండు సర్వేశ్వరుండు, ఇట్టిఈశ్వరుని దక్షిణ యిండ్యాదేశమున త్యాగరాజేశ్వరుఁడందురు. ఆపేరుగల దేవునికి దక్షిణ యిండ్యాలో బాహ్యపూజనలు, అర్చనలు గావింతురు. ఈదేవునిపేరట నచ్చుటికిభక్తులు త్యాగయ్య, త్యాగరాజు, త్యాగరాజమొదలి, త్యాగరాజయ్యరు, త్యాగరాజశెట్టి మొదలగు పేళ్ళను వాడుచున్నారు.

ఇది పూర్వభాగము.

## ఉత్తరభాగము (సూక్ష్మత్యాగము.)

వేదాంతశాస్త్రము ప్రప్రథమమున నుపనిషత్తులలోను ఇటీవల భగవద్గీతలలోను స్మార్తములలోను కడపట కలియుగమునందు పండిత పామరులకును స్త్రీలకును తెలియు నటుల నాంధ్రభాషలో గద్య పద్యాత్మక గ్రంథరూపముగను వ్యాపించుచున్నది.

తేజోఖండోపనిషత్తునం "దుపరతియోగము" ప్రతిపాదితమైయున్నది. ఉపరతి యోగమునకు లక్షణము:—

మనసేంద్రియములను లోఁబరచుకొన్న పుణ్యపురుషుఁడు సూర్యుఁడు సమస్త జలమును పీల్చునట్లును, దవానలము అడవిని దహించురీతిని బడబానలము సముద్రోదకము మింగుపగిదిని అవిద్యోపాధిగతమయిన త్రిగుణములనుజ్ఞానాగ్నిచేత బలించితనకంటెనితరము లేనివాఁడయిస్వయంప్రకాశ బ్రహ్మజ్ఞాన స్వరూపుఁడై యుండును. ఈ యవస్థయె యుపరతి యనఁబడును.

### ఉపరతియోగసాధనములు.

ఈయోగము లభించుటకు తేజోఖండోపనిషత్తునందు పదునైదు యోగాంగములు సాధనములుగనున్నవి. అవెవ్వియనగా:—

శ్లో॥ యమోహినియమస్త్యాగో మౌనందేశశ్చకాలతః।
ఆసనంమూలబంధంచ దేహసామ్యంచదృక్థ్సితిః।
ప్రాణసంయమనంచైవ ప్రత్యాహారశ్చధారణా।
ఆత్మధ్యానస్సమాధిశ్చ ప్రోక్తాన్యంగానివైక్రమాత్।
సర్వంబ్రహ్మేతివైజ్ఞానా దింద్రియగ్రామసంయమః॥

1 యమము, 2 నియమము, 3 త్యాగము, 4 మౌనము, 5 ఏకాంతదేశము, 6 కాలము, 7 ఆసనము, 8 మూలబంధము, 9 దేహసామ్యము, 10 దృక్థ్సితి, 11 ప్రాణాయామము, 12 ప్రత్యాహారము, 13 ధ్యానము, 14 ధారణ, 15 సమాధి.

ప్రస్తుతవిషయమగు నీసూక్ష్మత్యాగము పై 15 అంగములలో మూడవది. ఇందుకు నిర్వచనము:—

శ్లో॥ త్యాగఃప్రపంచరూపస్య సచ్చిదాత్మావలోకనాత్।
త్యాగోహిమహతాంపూజ్య సద్యోమోక్షప్రదాయకః।
యస్మాద్వాచోనివర్తంతే అప్రాప్యమనసాసహ॥
తేజోబిందూపనిషత్తులోనిది.

ఈశ్లోకము సంస్కృతముగాన ఇందలి సారాంశ మీ దిగువన నాంధ్రభాషలో తేటగ వివరింపఁబడును.

సూక్ష్మత్యాగ నిర్వచనము.

సూక్ష్మత్యాగమనఁగ జన్మపరంపరలేక పునరావృత్తిరహిత శాశ్వతబ్రహ్మ పదవికి సాధనము:— మఱియును:—కూటస్థస్వరూపుఁడై ప్రకాశించుతనకు వేరయిన స్థూల సూక్ష్మ కారణములగు దేహత్రియమును, వీనిలో నంతర్భాగములు పదునాల్గింద్రియములను, ఇతరములగు నంతర్బాహ్యదృశ్యములయొక్క సమూహము యావత్తు నపేక్షింపక అనగా 'తాను తనవి' యను నభిమానముంచక వానినన్నిటిని వదలుటలేక త్యజించుటసూక్ష్మత్యాగము. సూక్ష్మదేహములను త్యజించుటచేత సూక్ష్మత్యాగమని చెప్పను. దీనికి పద్యము— (సీతారామాంజనేయ సంవాదము)

తే॥ పరిత్యాగాత్మస్వరూపుఁడై బరగుతనకు
నన్యమైనట్టి దేహేంద్రియాదిదృశ్య

వితతియంతయు తొల్లక విమంచుటరయః।
త్యాగమనబొప్పు నిది రాజయోగతిలక॥

తాత్పర్యము పైనవివరించినదే. ఈత్యాగముయొక్క మహాఫలమునుబట్టి ఈపద్యమునకు ప్రతిపదార్థటీకవ్రాసియున్న బ్రి॥ శ్రీ పా॥ నాగేశ్వరశాస్త్రిగారును, టీకాతాత్పర్యమురచించిన బ్రి॥ శ్రీ గురులింగశాస్త్రిగారును సీనూత్న త్యాగమును త్యాగయోగమనిరి. ఇదిసర్వవిధములయిన త్యాగములలోను ప్రశస్తమయినదియు, ప్రకాశమానమయినదియుఁ గాన త్యాగరాజయోగమని పేరందుచున్నది. దీనికి సరితూగని స్థూలత్యాగములు సాలోక్య సారూప్యాది సగుణముక్తిప్రదము లయ్యుండఁగ నిది విదేహకైవల్యముక్తినిచ్చును. విదేహకైవల్యముక్తియనఁగ పునరావృత్తిరహిత శాశ్వతాఖండాద్వయపరబ్రహ్మానందప్రాప్తము. కాబట్టి 'త్యాగరాజయోగము'ను త్యాగరాజయోగవైభవ మని శ్లాఘింతురు.

త్యాగరాజమువలనప్రత్యగాత్మస్వరూపుడయిన తనకు దేహేంద్రియాది దృశ్య వితతి వదలినది. ఇట్టి వితతియే యవిద్యాపాశమనియు, లేక పాశమనియు, మాయామయ వ్యాప్తాపమనియు, యోగులందురు. కాబట్టి యీత్యాగరాజయోగ వైభవమునకు పాశముక్తయోగ మనియుం గూడ తాత్పర్యము.

నిర్గుణబ్రహ్మ మానసపూజావిధానమం దాది శంకరాచార్యులవారు:—

శ్లో॥ జీవశ్శివశ్శివోజీవస్సజీవః కేవలశ్శివః।

పాశబద్ధోగతో జీవో పాశముక్త స్సదాశివః॥ దీనితాత్పర్యమేమనఁగ:—

జీవుడే శివుడు, శివుడే జీవుడు. అవిద్యాపాశముచేత బంధింపబడినయెడల మలినజీవుఁడు. పాశమునుండి విముక్తుఁడైన సాక్షాత్సదాశివుఁడు. ఇందువలన పాశముక్తుఁడు సదాశివుఁడని సారాంశము తేలినది. అనగా పాశముక్తయోగము సదాశివయోగముగ సిద్ధించినది.

అయితే యిదియును పాశముక్తయోగము త్యాగరాజయోగవైభవముగా రుజువయినది గనుక (క్షేత్రగణిత ప్రత్యక్ష ప్రమాణప్రకారము) త్యాగరాజయోగవైభవము 'సదాశివమ్' అయినది.

ఇకను "సదాశివమ్" అను పదార్థతత్వమునుకూడ విచారింతము.

"శివం"=అనగ మంగళస్వరూపము=ఆనందస్వరూపము. "సదాశివం"=నిత్యానందము=శాశ్వతాఖండాద్వయ పరబ్రహ్మానంద ప్రభావము.

ఇటువిమ్మట "త్యాగరాజయోగవైభవమ్" శివశక్త్యాది సకల తత్త్వస్వరూప ప్రకాశ మెట్లయినదో విచారణాంశము:—

మంత్రశాస్త్రవేత్తలు "వసుధాదిశివాంతం" అనిగాని "శివాది వసుధాంతం" గాని ముప్పదియారుతత్త్వములునిర్ణయించిరి. వీటిపైతత్త్వము సదాశివతత్త్వమని స్మరింతురు. సదాశివతత్త్వము వీటికి పరాత్పరమైనందున వారు అను వాదించుశ్లోకము అంతర్నిరంతర నిరింధన మేధమానే మోహాంధకార పరిపంథినిసంవిదగ్నౌ। కస్మించి దద్భుతమరీ చివి కాసభూమా। విశ్వంజుహోమి వసుధాది శివావసానం. దీనికి నన్వయము (Skeleton or out line):—(అహం) వసుధాది శివావసానం- విశ్వం మోహాంధకార పరిపంథి సంవిదగ్నౌ జుహోమి. అనగ భూతత్త్వముమొదలు శివాంతం ముప్పదియారు తత్త్వములతో నిండియుండు విశ్వమను అజ్ఞానమనుచీకటిని ధ్వంసముచేయు జ్ఞానాగ్నియందు హుతము అహంపద వచ్చుడనైనట్లు చేయుచున్నాను. ఇట్లు సర్వతత్త్వాతీతుడగు 'అహంపదార్థ తత్త్వము' 36 తత్త్వవికారమగు విశ్వమును తనయందు హుతముచేయుచు సకలతత్త్వస్వరూపప్రకాశమాయెను. కాగా 'సదాశివం' అను తత్త్వమునకు సమానము. 'శివశక్త్యాదిసకలతత్త్వస్వరూపప్రకాశం' అయినది.

అయితే ఇంతకుమునుపు త్యాగరాజయోగవైభవము అనేది 'సదాశివం' అయ్యెనని రుజువాయెను

కాబట్టి క్షేత్రగణిత ప్రథమ ప్రత్యక్ష ప్రమాణమునుబట్టి 'త్యాగరాజయోగవైభవమునకు' 'శివశక్త్యాది సకలతత్త్వస్వరూపప్రకాశం' సమానము.

యోగశాస్త్రవేత్తయు మంత్రశాస్త్రవేత్తయు సంగీతసాహిత్య నిధియునగు దాక్షిణాత్యుడు దీక్షితులను మహాపురుషుడు క్రిందివిధిగ నొక కృతియందు త్యాగరాజయోగవైభవమును వర్ణించి భజించెను.

రాగము- ఆనందభైరవి- తాళము- రూపకము.

పల్లవి- త్యాగరాజయోగవైభవం- సదాశ్రయామి
త్యాగరాజయోగవైభవం- సదాశివం॥ త్యా॥ వై॥ సదా॥

అ-ప- అగరాజయోగవైభవం- రాజయోగవైభవం-
యోగవైభవం- వైభవం- భవం- వం॥ త్యా॥

చ- నాగరాజవినుతపదం- నాదబిందుకళాస్పదం-
యోగిరాజవిదితపదం- యుగభోగమోక్షప్రదం-
యోగరూపనామరూప విశ్వసృష్ట్యాదికారణం-
యోగపరిత్యక్తాద్యాధివిఘటకాద్వారణం-

శ్రీగురుగుహాగురుం- సచ్చిదానందభైరవీశం-
శివశక్త్యాది సకలతత్వస్వరూపప్రకాశం- స్వప్రకాశం-
స్వరూపప్రకాశం- తత్వస్వరూపప్రకాశం-
శివశక్త్యాది సకలతత్వస్వరూప ప్రకాశం- త్యా॥

ఇచ్చట( జేర్కొన్న దీక్షితులవారి త్యాగరాజయోగము బ్రహ్మానంద స్వాముగ నెంచి మఱియొకకృతియందు గురుగుహారూపమును దీనిని మనఃపూర్తిగ

మఱియును దేహేంద్రియాది ద్వైత్యవిరతి యగు నీసంసారదుఃఖమునకు మాయామయహృత్తాపము ప్రతిపదమనియు అట్టి తాపమును త్యజించుట త్యాగరాజయోగ మనియు మానవజన్మము తటస్థించ(గ పరబ్రహ్మమునందు నిరతిశయసుఖము పొందు మఱియు సత్వగుణోపాధితో (గూడి సద్గుణబ్రహ్మము సదాశివతత్వమనియు బ్రహ్మము పాధిగత్వమునొందిన జీవోద్భవ మనియు, తత్ త్వం అనియు, తామస యినపుడు విశ్వవైభవమనియు, తారకేశ్వరమనియు, ఆనందభైరవమనియు శ్రీగురుపాదమునకుమ్రొక్కి, గురునామస్మరణము(జేసి మోహమను అభరణమును జయించి గురుపాదమే తదేకశరణమని గురుగుహారూపమను బ్రహ్మమునుభజియింపుమనియు ప్రబోధించిరి. ఇందుకై యా దీక్షితులవారి స్వరచితమగు సంగీతకృతి:—

రాగము- ఆనందభైరవి- తాళము- రూపకము.

పల్లవి- మనసాగురుగుహా రూపం భజరే-
మాయామయహృత్తాపం త్యజరే- మ-రే॥

అనుపల్లవి-మానవజన్మని సంప్రాప్తేసతి పరమాత్మని-
నిరతిశయసుఖం వ్రజరే। మ॥

చ॥ సత్వగుణోపాధి సహితసదాశివం।
స్వావిద్యాస్సమేత జీవోద్భవం।
తత్వంతామసయుత విశ్వవైభవం।
తారకేశ్వరమానంద భైరవం॥
నత్వాశ్రీగురుచరణం ఇత్వానామస్మరణం।
జిత్వామోహాభరణం మత్వాతదేకశరణం॥

ఇట్లు
బుధజనవిధేయుడు,
పెద్దాడ చిట్టిరామయ్య.



ఈక్రిందిసంతకము గలవారి చిరునామా (Address)కు వ్రా-యువారికి ఈదిగువ జాబితా తహాన్వాలు పుస్తకములు లభించును.

ముప్పదియిద్దరు మంత్రులచరితము ప్రతి 1కి వెల 0—4—0

ఇదినాచేత సంపాదించబడి రాజమంద్రికాలేజి పాతపండితులు బ్ర. శ్రీ. క. శివశంకరశాస్త్రిగారు, మహామహోపాధ్యాయ బ్ర. శ్రీ. కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు కాకినాడ కాలేజి పండితులు మిషన్ హైస్కూల్ల తెలుగు పండితులు మొదలగు వారియోగ్యతా పత్రికలనొందినది.

శాంతంభూషణం ప్రతి 1కి 0—1—0 ఇదినాచేత రచించబడినది. ఈవిషయముంగూడ యోగ్యతా పత్రికలుసదరు క. శివశంకరశాస్త్రి గారు మొదలగువారినుండి వచ్చియున్నవి.

తెనుగు, ఇంగ్లీషుదీపిక— మొదటిపాఠ పుస్తకము చిన్న[illegible] ప్రథమ విద్యార్థులకు నత్యంతోపయోగకరము. ప్రతి 1కి వెల 0—[illegible]—0,

డిటో రెండవపాఠపుస్తకము ప్రతి 1కి 0-4-0

త్యాగరాజయోగవైభవము ప్రతి 1కి వెల 0—3—0

పలయువారు వి. పి. ఖర్చులుంగూడ భరింపవలెను.

పెద్దాడ చిట్టిరామయ్య,

పిఠాపురం సంస్థాన పెన్షనరు.

పవరుపేట—యేలూరు కృష్ణాజిల్లా అనిగాని గుజరాతి వీధి పిఠాపురం—గోదావరిజిల్లా అనిగాని వ్రాయువలెను.

